లిటిల్ మాస్టర్స్

# తెలుగు వ్యాకరణము

హైస్కూలు, మెట్రిక్యులేషన్, కాలేజి విద్యార్థుల కొరకు
సులభ పద్ధతిలో వ్రాయబడినది.



ఎడిటర్ :
యం. విశ్వనాథరాజు ఎం.ఎ.

పబ్లిషర్స్ :
నవరత్న బుక్ సెంటర్
కారల్ మార్క్స రోడ్, విజయవాడ - 2.

లిటిల్ మాస్టర్స్

# తెలుగు వ్యాకరణము

రచన
యం. విశ్వనాథరాజు, యం.ఏ.,

ప్రథమ ముద్రణ :
డిసెంబర్ - 1998

ప్రచురణ హక్కులు :
బి.కె.ఆర్. మూర్తి
28-22-20. రహిమాన్ వీధి,
అరండల్ పేట, విజయవాడ-2.
ఫోన్ : 432813

వెల : రూ. **30-00**

ప్రింటర్స్ :
అశోక్ ప్రింటర్స్

# విషయసూచిక

8. ఎనిమిదివ ప్రకరణము - ఛందస్సు

1. లఘువులు
2. గురువులు
3. గణములు
4. యతి
5. ప్రాస
6. వృత్తములు

   1. ఉత్పలమాల 2. చంపకమాల 3. శార్దూల విక్రీడితము 4. మత్తేభ విక్రీడితము 5. మత్త కోకిలము 6. తరలము 7. స్రగ్ధర 8. మహాస్రగ్ధర 9. భుజంగ ప్రయాతము 10. పంచామరము 11. వసంత తిలకము 12. స్రగ్విణి 13. తోటకము 14. మాలిని 15. మానిని 16. లయగ్రాహి 17. స్వాగత వృత్తము 18. మందాక్రాంతము 19. దండకము 20. కవిరాజ విరాజితము (ఇరవై వృత్తములు)

7. జాతులు

   1. కందము 2. ద్విపద 3. ఉత్సాహము 4. తరువోజ 5. మధ్యాక్కర 6. మధురాక్కర

8. ఉపజాతులు

   1. తేటగీతి 2. ఆటవెలది 3. సీసము

. తొమ్మిదవ ప్రకరణము

1. వ్యుత్పత్తులు
2. పర్యాయపదములు
3. నానార్థములు

# 1. మొదటి ప్రకరణము - వర్ణములు

1. వర్ణము :

ఒకసారి ఉచ్చరించుటకు వీలైన ధ్వనిని వర్ణము అందురు.

ఉదా: అ - అనునది ఒక వర్ణము.

క - అనుదానిలో క్ + అ - అనురెండు వర్ణములున్నవి.

2. అక్షరము :

ఒకసారి ఉచ్చరించుటకు వీలైన వర్ణముల సముదాయమును అక్షరమందురు.

ఉదా:' శ్రీ ' అనునది ఒక అక్షరము.

ఇది శ్-ర్+ఈ - అను మూడు వర్ణముల సముదాయము.

అక్షరమునకు, వర్ణమునకు పై విధముగా భేదమున్నప్పటికి సామాన్యముగా రెండింటిని సమానార్థకములుగానే భావించుచున్నారు.

3. వర్ణసమామ్నాయము :

వర్ణముల సమూహమును వర్ణసమామ్నాయమందురు.

ఆంధ్రమునకు వర్ణములు ఏబదియారు (56) అవి.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ

ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః

క ఖ గ ఘ జ - క వర్గము

చ ఛ జ ఝ ఞ - చ వర్గము

ట ఠ డ ఢ ణ - ట వర్గము

త థ ద ధ న - త వర్గము

య ర ఱ ల ళ వ శ ష స హ

పైన తెలిపిన అక్షరములలో ౠ, ఌ, ౡ, (అరసున్న) ఁ, ఙ, ఱ అనునవి ప్రస్తుతము ఉపయోగములో లేవు.

మిగిలిన అక్షరములు —— 49

వర్ణముల సముదాయమును ముఖ్యముగా మూడు విధములుగా విభజించవచ్చును.

1. అచ్చులు 2. హల్లులు 3. ఉభయాక్షరములు.

4. అచ్చులు :

ప్రస్తుతము వాడుకలో నున్నవి - 13

అవి - అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ఎ ఏ ఐ ఒ ఓ ఔ.

అచ్చులకు ప్రాణములు, స్వరములు అను పేర్లు కలవు.

అచ్చుల సహాయము లేనిదే హల్లులు పలుక బడవు.

ఉదా: క — క్ + అ

ఇచట 'క్' అనునది హల్లు దీనికి 'అ' చేరినచో 'క' అగును.

హల్లుల పలుకు బడికి ప్రాణముల వంటివి అగుట వలన అచ్చులకు ప్రాణములని పేరు వచ్చినది.

స్వతంత్రమైన ఉచ్చారణ కలిగి యుండుట వలన అచ్చులకు స్వరములని పేరు వచ్చినది.

అచ్చులు రెండు రకములు

అవి 1. హ్రస్వములు 2. దీర్ఘములు

హ్రస్వములు - ఒక మాత్ర అనగా రెప్పపాటు కాలములో ఉచ్చరించబడు అచ్చులను హ్రస్వములు అందురు.

అవి - 7. అ ఇ ఉ(ఋ, ఌ) ఎ ఒ

రెండు మాత్రల కాలములో ఉచ్చరించబడు అచ్చులను దీర్ఘములు అందురు.

అవి - 9. ఆ ఈ ఊ (ౠ, ౡ) ఏ, ఐ, ఓ, ఔ, వంకరగా నుండుటచే ఎ ఏ ఒ ఓ లను 'వక్రములు' అందురు.

ఎక్కువ వంకరగా నుండుటచే ఐ ఔ ల 'వక్రతమములు' అందురు.

మూడు మాత్రల కాలములో నుచ్చరింపబడుటచే ఐ ఔ లను 'ప్లుతములు' అందురు.

5. హల్లులు :-

హల్లులకు ప్రాణులు, వ్యంజనములు అను పేర్లు కలవు.

ప్రాణములైన అచ్చులను కలిగియున్నవి కావున హల్లులకు 'ప్రాణులు' అని పేరు వచ్చినది.

అచ్చుల సహాయముతో పలుకుట వలన హల్లులకు 'వ్యంజనములు' అని పేరు వచ్చినది.

హల్లులు - 37. అవి

క ఖ గ ఘ ఙ
చ ఛ జ ఝ ఞ
ట ఠ డ ఢ ణ
త థ ద ధ న
ప ఫ బ భ మ
య ర (ఱ) ల ళ వ శ ష స హ

హల్లులు ప్రధానముగా మూడు రకములు.

అవి 1. పరుషములు. 2 సరళములు 3. స్థిరములు.

1. పరుషములు - పరుషముగా పలుక బడునవి - 6. అవి. క చ ౘ ట త ప

2. సరళములు - సరళముగా పలుకబడునవి - 6. అవి. గ జ ౙ డ ద బ.

3. స్థిరములు - పరుషములు సరళములు కాక మిగిలిన హల్లులన్నియు స్థిరములు - 25. అవి. ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర (ఱ) ల ళ వ శ స హ.

స్పర్శములు - 'క' నుండి 'మ' వరకు గల 27 అక్షరములను స్పర్శములందురు. ధృఢమైన స్పర్శము కలుగుట వలన వీటికి స్పర్శములు అని పేరు వచ్చినది.

స్పర్శములు 5 వర్గములు గా విభజింపబడినవి.

క ఖ గ ఘ ఙ - క వర్గము
చ ౘ ఛ జ ౙ ఛ ఝ ఞ - చ వర్గము
ట ఠ డ ఢ ణ - ట వర్గము

3. ము - అను అక్షరమునకు బదులుగా నిండు సున్న వ్రాయకూడదు.

ఉదా : కలం, ధనం, పుస్తకం - అని వ్రాయ కూడదు.
కలము, ధనము, పుస్తకము అని వ్రాయుట మంచిది.

4. సున్న తరువాత అనునాసికము వ్రాయరాదు.

ఉదా : అంమ, నాంన - అని వ్రాయరాదు.
అమ్మ, నాన్న, - అని వ్రాయవలెను.

5. సున్న తరువాత ద్విత్వాక్షరము (ఒకేరకమైన రెండు అక్షరములు) వ్రాయరాదు.

ఉదా : అంన్నము, కంన్నము - అని వ్రాయరాదు
అన్నము, కన్నము - అని వ్రాయవలెను.

2. అరసున్న :

అరసున్నకు - అర్థ బిందువు, అర్ధానుస్వారము ఖండ బిందువు, కురుచ బొట్టు అను పేర్లు కలవు.

ఉదా : రాముఁడు, కృష్ణుఁడు.
అర సున్న ప్రస్తుతము వాడుకలో లేదు.

3. విసర్గ :-

విసర్గ అనగా విడువబడునది అని అర్థము సంస్కృత పదములలో విసర్గను ఉపయోగింతురు.

ఉదా :- దుఃఖము, అంతఃపురము.

## 7. వర్ణోత్పత్తి స్థానములు :-

ఉత్పత్తి స్థానమును బట్టి వర్ణములు తొమ్మిది విధములుగా విభజింపబడినవి.

1. కంఠ్యములు
2. తాలవ్యములు
3. మూర్ధన్యములు
4. దంత్యములు
5. ఓష్ఠ్యములు
6. నాసిక్యములు
7. కంఠతాలవ్యములు
8. కంఠోష్ఠ్యములు
9. దంతోష్ఠ్యములు

**1.** కంఠ్యములు – కంఠమునుండి పుట్టిన వర్ణములు - 9
అవి - అ ఆ క ఖ గ ఘ ఙ హః

**2.** తాలవ్యములు – తాలువు (దౌడ) ల నుండి పుట్టినవి.
అవి - ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ.

**3.** మూర్ధన్యములు - మూర్ధము (నోటిపై భాగం) నుండి పుట్టినవి - 12. అవి.
ఋ ౠ ట ఠ డ ఢ ణ ర (ఱ) ల ళ ష

**4.** దంత్యములు - దంతములనుండి పుట్టిన వర్ణములు. అవి.
త థ ద ధ న ల స చ జ

**5.** ఓష్ఠ్యములు - ఓష్ఠ్యము (పెదవి)ల నుండి పుట్టిన వర్ణములు - 7 అవి
ఉ ఊ ప ఫ బ భ మ

**6.** నాసిక్యములు - నాసిక నుండి పుట్టిన వర్ణములు - 5 వీనినే అనునాసికములందురు. అవి - ఙ, ఞ, ణ, న, మ.

7. కంఠతాలవ్యములు - కంఠము - తాలువుల నుండి పుట్టిన వర్ణములు - 3. అవి - ఎ - ఏ - ఐ.

8. కంఠోష్ఠ్యములు - కంఠము పెదవుల నుండి పుట్టిన వర్ణములు - 3. అవి - ఒ - ఓ - ఔ.

9. దంతోష్ఠ్యము - దంతము పెదవుల నుండి పుట్టిన వర్ణములు - 1. అది - వ.

## 8. అచ్చుల రూపములు

అచ్చులు హల్లులతో చేరినపుడు ఈ క్రింది రూపములలను పొందును.

| అచ్చులు | హల్లులతో చేరినపుడు వ్రాయు రూపములు | వాటి పేర్లు |
|---|---|---|
| అ | ✓ | తలకట్టు |
| ఆ | ా | దీర్ఘము |
| ఇ | ి | గుడి |
| ఈ | ీ | గుడి దీర్ఘము |
| ఉ | ు | కొమ్ము |
| ఊ | ూ | కొమ్ము దీర్ఘము |
| ఋ | ృ | వట్రునుడి లేక వృత్తము |
| ఎ | ె | ఎత్వము |
| ఏ | ే | ఏత్వము |
| ఐ | ై | ఐత్వము |
| ఒ | ొ | ఒత్వము |
| ఓ | ో | ఓత్వము |
| ఔ | ౌ | ఔత్వము |

3. ప్రత్యయము :

విశేషార్థములో శబ్దమునకు చేరెడి అక్షరమును గాని, అక్షరములను గాని ' ప్రత్యయము ' లేక ' వర్ణకము ' అందురు.

4. ప్రకృతి :

ప్రత్యయము చేరుటకు యోగ్యమైన శబ్దమును ప్రకృతి అందురు.

5. ప్రాతిపదికము :

నామ విభక్తి ప్రత్యయములు, తద్ధిత ప్రత్యయములు చేరుటకు తగిన ప్రకృతిని ప్రాతిపదికము అందురు.
ఉదా : రాముని - అనుపదము నందు

' రాము ' అనునది ప్రాతిపదికము ' ని ' అనునది ద్వితీయా విభక్తి ప్రత్యయము

పేరు + ఇమి = పేరిమి. ఇందు పేరు అనునది ప్రాతిపదికము ' ఇమి ' అనునది తద్ధిత ప్రత్యయము.

6. ధాతువు :

క్రియా విభక్తులును, కృత్ ప్రత్యయములును చేరుటకు యోగ్యమైన ప్రకృతిని ' ధాతువు ' అందురు.
ఉదా : చదువును అను క్రియా పదమందు
' చదువు ' అనునది ప్రకృతి లేక ధాతువు ' ను ' అనునది ప్రత్యయము.

7. వ్యుత్పత్తి - పద విభజనము :

వ్యుతుత్తిని బట్టి ఆంధ్ర పదములను ఐదు విధములుగా విభజింపవచ్చును.

| | | |
|---|---|---|
| శ్రీః | సిరీ | సిరి |
| రాజ్ఞీ | రాణీ | రాణి |
| శృఙ్గారః | సింగారో | సింగారము |

2. తద్భవములు - సంస్కృత ప్రాకృతభవములు తద్భవములు. సంస్కృత ప్రాకృత శబ్దముల నుండి పుట్టిన శబ్దములు వివిధములైన మార్పులను పొందును.

ఉదా :

| సంస్కృతము | | సంస్కృతభవము |
|---|---|---|
| ఆకాశః | - | ఆకసము |
| కుడ్యః | - | గోడ |
| తామరసమ్ | - | తామర |
| వక్రః | - | వంకర |
| సూచీ | - | సూది |
| మృగః | - | మెకము, మెగము |

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతభవము |
|---|---|---|
| ప్రయాణమ్ | పయాణం | పయనము |
| ప్రవాళః | పవాళో | పవడము, పగడము |
| లక్ష్మీః | లచ్చీ | లచ్చి |
| ఆశ్చర్యమ్ | అచ్చేరం | అచ్చెరవు |
| పృధివీ | పుఢవీ | పుడమి |
| విష్ణుః | విణ్హూ | వెన్నుడు |
| స్తమ్భః | ఖంబో | కంబము |

3. దేశ్యములు - తెలుగుదేశము నందు నిత్యవ్యవహారములో వాడబడు పదములను దేశ్యములందురు ఈ పదములకు సంస్కృత ప్రాకృత పదములతో ఏవిధమైన సంబంధము ఉండదు.

2. అచ్చు తెలుగు పదములలో పరుషములు, సరళములకు ముందే పూర్ణ బిందువు ఉండును. కావున స్థిరాక్షరములకు ముందు పూర్ణ బిందువు ఉన్న పదములు తత్సమములుగా గుర్తించవచ్చును.

ఉదా :- సంయమి, సంరావము, సంతాపము
సంవాదము, వంశము, హంస, సంహారము.

3. ఉపసర్గలు గల పదములు తత్సమములు (ప్ర, పరా, ప్రతి, పరి, అతి, అధి, అభి, అవ అను, ఉప, సమ్, సు, అప, ని, వి, నిర్, దుర్, ఉత్, అపి. ఆ - మొదలగు 20 ఉపసర్గలతో కూడిన పదములు తత్సమములు.

ఉదా :- ప్రయాణము, పరాభవము, ప్రతిరూపము, పరిచయము మొదలగునవి.

4. చై, జై, య, వో లు మొదటగల పదములు తత్సమములు

ఉదా : చైత్రము, యముడు, యోగ్యుడు, వోఢ, జైవాత్రుకుడు.

5. సంయుక్తాక్షరములు గల పదములు తత్సమములు

ఉదా : పుస్తకము, విద్య, వైద్యుడు, గ్రామము.

6. అభావాద్యర్థము (లేదుఅను అర్థము) నిచ్చు 'అ' 'అన్' మొదట గల పదములు తత్సమములు.

ఉదా : అ - అసమానము, అచంచలము
అన్ - అనుమానము, అనాదోరణము.

7. స (తోడ) సత్ (మంచి) కా - కు (చెడ్డ) అనునవి మొదటగల పదములు తత్సమములు

ఉదా : సపరివారము, సజ్జనుడు (సత్ + జనుడు)

8. తర - తమ, వంత - మంత, వతి - మతి అను ప్రత్యయాంత శబ్దములు తత్సమములు.

ఉదా: తర - సుందరతరము

తమ - సుందరతమము

వంత - భగవంతుడు

వతి - గుణవతి

మతి - శ్రీమతి

9. హలంత శబ్దములు తత్సమములు:

ఉదా: జలము చ్ (సం) - జలముచము (తత్సమము)

భిషజ్ - భిషక్కు

10 ఇంచు చివరగల అప్రేరణార్థక ధాతువులు తత్సమములు.

ఉదా: వచ్ + ఇంచు - వచించు

హస్ + ఇంచు - హసించు

తప్ + ఇంచు - తపించు

ఆవులించు, ఆలించు, జాడించు, తిలకించు పరికించు, పలవరించు, అప్పగించు, ఆరగించు గాలించు మొదలగు ధాతువులు తత్సమములు కాదు.

9. అచ్చ తెలుగుపద వివేచనము:

సంస్కృత పదములను గుర్తించునట్లు గానే తెలుగుపదములను కూడ గుర్తించుటకు కొన్ని మార్గములు కలవు.

1. ఎ, ఒ, -ఁ చ, జ - లు అను ఆరువర్ణములు అచ్చ తెలుగులో మాత్రమే ఉన్నవి. సంస్కృతములో లేవు. కావున ఇవిగల పదములు అచ్చ తెలుగు పదములుగా గుర్తించ వచ్చును.

ఉదా : ఎ - ఎగతాళి, ఎవరు, ఎక్కడ

ఒ - ఒకడు, ఒయ్యారము

హల్లుతో కూడిన ఎ, ఒలు - నెయ్యము, చెలిమి, దొర, రొక్కము మొ.వి.

అర్ధ బిందువు : ( - కోఁతి, అరఁటి

చ - చేప, చోట్ల

జ - జేత, జోట్టు

10. తద్భవ పదవివేచనము :

సంస్కృత పదముల నుండి తద్భవ పదము లేర్పడునపుడు కొన్ని ముఖ్యముర మార్పులు జరుగును. ఆ మార్పులను కొన్నింటిని గమనింపుడు.

1. ' ఋ ' వర్ణమునకు రేఫము వచ్చును

| | | | |
|---|---|---|---|
| ఉదా : | ఋషి | - | రుసి |
| | ఋక్కము | - | రిక్క |

2. ఖ, ఛ, ఠ, థ, ఫ - లకు క, చ, ట, త, పలు వచ్చును.

| | | | |
|---|---|---|---|
| ఉదా : | ముఖము | - | మొకము |
| | ఛవి | - | చవి |
| | పీఠ | - | పీట |
| | కథ | - | కత |
| | ఫలము | - | పలక |

3. ఘ, ఝ, ఢ, ధ, భ - లకు గ, జ, డ, ద, బలు వచ్చును.

| | | | |
|---|---|---|---|
| ఉదా : | ఘంట | - | గంట |
| | ఘటిక | - | గడియ |

ప్రౌఢ - ప్రోడ

ధర్మము - దమ్మము

భక్తుడు - బత్తుడు

4. సంయుక్తాక్షరములలో ఒకటి లోపించును.

ఉదా: స్వామి - సామి

పంక్తి - బంతి.

5. 'క్ష' - కారమునకు క - స - చ లలో ఏదైన వచ్చును.

ఉదా: లాక్ష - లక్క

క్షేమము - సేమము

భిక్షము - బిచ్చము

6. 'జ్ఞ' కారమునకు నకారము వచ్చును.

ఉదా: ఆజ్ఞ - ఆన.

7. స్వకారమునకు 'సొ' వచ్చును.

ఉదా: స్వర్గము - సొన్నము

స్వత్వము - సొత్తు

8. కొన్ని పదములకు క్యానడి తొలగును.

ఉదా: మాణిక్యము - మానికము

జ్యోతి - జోతి

9. కొన్ని పదాలకు క్యావడి తొలగి ఎత్వదిత్వములు వచ్చును.

ఉదా: పద్యము - పద్దెము

పుణ్యము - పున్నెము

కన్య - కన్నె

విద్య - విద్దె

10. కొన్ని పదాలకు రేఫము తొలగి ద్విత్వము వచ్చును.

ఉదా: సర్పము - సప్పము

అర్పణము - అప్పనము

11. కొన్ని పదాలకు క్రావడి లోపించును

ఉదా: ప్రసాదము - పసాదము

ప్రాయము - పాయము

12. ఉకారమునకు ఒకారము వచ్చును.

ఉదా: కుంతి - గొంతి

కులము - గొలము

13. హ - లో హల్లు లోపించి అచ్చు మిగులును.

ఉదా: హంస - అంచ

హరణము - అరణము

14. ణ - కారమునకు నకారము వచ్చును.

ఉదా: ప్రయాణము - పయనము

ద్రోణి - దోనె

15. శ - ష లకు సకారము వచ్చును.

ఉదా: శాల - సాల

రోషము - రోసము

16. యకారమునకు జకారము వచ్చును.

ఉదా: యోగి - జోగి

ద్యూతము - జూతము

17. క, ట, త - లకు గ డ ద లు వచ్చును.

ఉదా: కుంతి - గొంతి

అటవి - అడవి

మతి - మది

18. త, - చ, లు ఒకదానికొకటి వచ్చును.

ఉదా: త - చ త్యాగము - చాగము

చ - త గుచ్ఛము - గుత్తి

19. సంయుక్తాక్షరములు విడిపోవును.

ఉదా : రత్నము - రతనము

మర్యాద - మరియాద

20. చ - సలు ఒకదానికొకటి వచ్చును.

ఉదా : చ - స నారాచము - నారసవ

స - చ హంస - అంచ.

21. పదములో కొన్ని వర్ణములు లోపించుట, కొన్ని వర్ణము అధికము గావచ్చుట జరుగను.

ఉదా : తామరసము - తామర (సములోపవ

రథము - అరదము అ - అధికః

## 11. ప్రకృతి - వికృతులు :

సంస్కృత పదములతో సమానమైన పదము ప్రకృతులు. సంస్కృత, ప్రాకృత శబ్దముల నుండి పుట్టి పదములు వికృతులు. ఈక్రింది ప్రకృతి - వికృతి పదముల గమనింపుడు.

| ప్రకృతి | - వికృతి | ప్రకృతి | - వికృతి |
|---|---|---|---|
| అంకము | - అంకె | అద్భుతము | - అబ్బురము |
| అంకుశము | - అంకుసము | అధికము | - అదనము |
| అంగుష్ఠము | - అంగుటము | అనాథ | - అనద |
| అంచలము | - అంచు | అన్యాయము | - అన్నెము |
| అంతఃపురము | - అంతిపురము | అపూర్వము | - అపురూపవ |
| అక్షతలు | - అక్షింతలు | అప్సరస | - అచ్చర |
| అక్షరము | - అక్కరము | అమావాస్య | - అమవస |
| అగాధము | - అగడ్త | అర్ధరాత్రి | - అద్దమరేయి |
| అటవి | - అడవి | అర్పణము | - అప్పనము |

| | | | |
|---|---|---|---|
| ందోళిక | - అందలము | కావటి | - కావడి |
| క్షి | - ఆన | కావ్యము | - కబ్బము |
| ధారము | - ఆదరువు | కాష్టము | - కట్టె |
| రంభము | - ఆరబము | కుండీ | - కుండ |
| ర్య | - అయ్య | కుంతి | - గొంతి |
| లస్యము | - ఆలసము | కుటీరము | - గుడిసె |
| శ్చర్యము | - అచ్చెరువు | కుడ్యము | - గోడ |
| శ్రయము | - ఆసరా | కుమారుడు | - కొమరుడు |
| హారము | - ఓగిరము | కుర్కురము | - కుక్క |
| చ్ఛ | - ఇచ్చ | కులము | - గొలము |
| ష్టిక | - ఇటుక | కులాయము | - గూడు |
| ఈర్ష్య | - ఈసు | కూర్పాసము | - కుబుసము |
| పాధ్యాయుడు | - ఒజ్జ | క్రాంతి | - కార్తె |
| ఋక్షము | - రిక్క | క్షారము | - కారము |
| ఋషి | - రుసి | క్షేమము | - సేమము |
| ంఠము | - గొంతు | ఖడ్గము | - కగ్గము |
| ంద | - గడ్డ | ఖని | - గని |
| కంబళము | - కంబళి | గర్తము | - గంట |
| కక్ష | - చంక | గహ్వరము | - గుహ |
| కఠారు | - కటారి | గార్ధభము | - గాడిద |
| కన్య | - కన్నె | గుచ్ఛము | - గుత్తి |
| కబళము | - కవళము | గృధ్రము | - గద్ద |
| కర్తరి | - కత్తెర | గృహము | - గీము |
| కర్తి | - కత్తి | గోధూమము | - గోధుమ |
| కాకము | - కాకి | గౌరవము | - గారవము |
| కాచము | - గాజు | గ్రంథి | - కంతి |
| కార్యము | - కర్జము | ఘంట | - గంట |

| | | | |
|---|---|---|---|
| ఘటము | - కడవ | దృఢము | - దిటము |
| చతురంగము | - చదరంగము | దేవుడు | - దేవర |
| చతురస్రము | - చదరము | దేవాలయము | - దేవళము |
| చిత్రము | - చిత్తరువు | దేవి | - దేవేరి |
| చిన్నము | - చిన్నె | దైవము | - దయ్యము |
| చేలము | - చీర | దోషము | - దోసము |
| చేష్ట | - చేత | దోషకము | - దోసము |
| ఛాయ | - చాయ | దౌష్ట్యము | - దుండగము |
| జట | - జడ | ద్యూతము | - జూతము |
| జలేకము | - జలగ | ద్రోణిక | - దొన్నె |
| జ్యోతి | - జోతి | నాట్యము | - నట్టువ |
| తాంబూలము | - తమలము | నిద్ర | - నిదుర |
| తామరసము | - తామర | నిర్భరము | - నిబ్బరము |
| తాలము | - తాడి | నీరము | - నీరు |
| తింత్రాణి | - చింత | నిరాజనము | - నివ్వాళి |
| తిథి | - తేదీ | నౌక | - నావ |
| తీరము | - దరి | పక్షి | - పక్కి |
| తుండము | - తొండము | పంక్తి | - బంతి |
| తురుష్కుడు | - తురక | పద్యము | - పద్దెము |
| తుషారము | - తుంపర | పరిహాసము | - పరేచకము |
| త్రుటి | - చిటిక | పశువు | - పసరము |
| తృతీయ | - తడియ | పాదుకలు | - పావుకోళ్ళు |
| త్యాగము | - బాగము | పాయసము | - పాసెము |
| త్రినగము | - తెలుగు | పారదము | - పాదరసము |
| త్వక్కు | - తొక్క | పారావతము | - పావురము |
| దర్భ | - దుబ్బ | పార్శ్వము | - ప్రక్క |
| దిక్కు | - దెస | పిష్టము | - పిండి |

యౌవనము - జవ్వనము
రత్నము - రతనము
రథము - అరదము
రహటము - రాట్నము
రాక్షసుడు - రక్కసుడు
రాజభారము - రాయబారము
రాజసము - రాయసము
రాజహంస - రాయంచ
రాజ్ఞి - రాణి
రాత్రి - రాతిరి
రాశి - రాసి
రూప్యము - రూపాయి
రేఖ - రేక
రోషము - రోసము
లక్ష్మి - లచ్చి
లాంగలము - నాగలి
లాక్ష - లక్క
వంశము - వంగడము
వటకము - వడియము
వటువు - వడుగు
వర్ణము - వన్నె
విజ్ఞాపనము - విన్నపము
విద్య - విద్దె
విష్ణువు - వెన్నుడు
వృద్ధి - వడ్డి
వేత్రము - బెత్తము
[illegible] - [illegible]

వ్యర్థము - వమ్ము
వ్యవహారము - బేహారము
వ్యాఖ్యానము - వైనము
శంక - జంకు
శకునము - సకినము
శక్తి - సత్తి
శయ్య - సెజ్జ
శర్కర - చక్కెర
శాస్త్రము - చట్టము
శిఖ - సిగ
శిరోనామము - చిరునామ
శీతము - సేతువు
శుకము - చిలుక
శృంగారము - సింగారము
శ్రీ - సిరి
సంజ్ఞ - సైగ
సంతతి - సంతు
సంతోషము - సంతసము
సంభ్రమము - సంబరము
సక్తు - సత్తు
సన్యాసి - సన్నాసి
సపత్ని - సవతి
సర్పము - సప్పము
సహజము - సాజము
సహాయము - సాయము
సింహము - సింగము

| | | | |
|---|---|---|---|
| సుఖము | - సుకము | స్ఫటికము | - పటిక |
| సుధ | - సుద్ద | స్రావము | - జావ |
| సుభగము | - సొబగు | స్వతంత్రము | - సొంతము |
| సూక్తి | - సుద్ది | స్వర్గము | - సొన్నము |
| సూచి | - సూది | స్వామి | - సామి |
| స్తంభము | - కంబము | స్వామిని | - సాని |
| స్థూలము | - తోలము | హింగువ | - ఇంగువ |
| స్నేహము | - నెయ్యము | హిమము | - ఇవము |
| స్నానము | - తానము | హృదయము | - ఎద |

**12.** ద్రుత ప్రకృతికములు :

రూపమును బట్టి ఆంధ్ర పదములను రెండు విధములుగా విభజింప వచ్చును.

1. ద్రుత ప్రకృతికములు 2. కళలు

నకారము అంతమందు గల పదములన్నియు ద్రుతప్రకృతికములు. ఈ నకారము లేకపోయినను ఆ పదము యొక్క అర్థము మారదు.

ఉదా : చేతన్ - చేత
తోడన్ - తోడ

**13.** కళలు :

ద్రుతము అనగా నకారము చివరలేని పదములన్నియు కళలు.

ఉదా : రాముడు, గోపాలుడు
వస్తువు, రథము.

# మూడవ ప్రకరణము
# భాషాభాగములు

వాక్యములో ఉపయోగమును బట్టి పదములు వివిధ తరగతులుగా విభజింపబడినవి. వానిని భాషాభాగములందురు.

భాషా భాగములు - 9.

1. నామవాచకములు
2. సర్వనామములు
3. విశేషణములు
4. క్రియలు
5. క్రియావిశేషణములు
6. విభక్తులు
7. సముచ్ఛయములు
8. ఆశ్చర్యార్థకములు
9. అవ్యయములు

**1. నామవాచకములు :**

ఒక వ్యక్తినిగాని, వస్తువునుగాని, జాతినిగాని, గుణమునుగాని తెల్పు పదములు నామవాచకము అని అందురు.

నామవాచకములు 8 విధములు

1. సంజ్ఞానామవాచకములు
2. జాతినామవాచకములు
3. గుణనామవాచకములు
4. క్రియానామవాచకములు

5. సముదాయనామవాచకములు
6. ద్రవ్యనామవాచకములు
7. ధాతుజనామావాచకములు
8. తద్ధితనామవాచకములు

**1. సంజ్ఞానామ వాచకములు :-**

ఒక వ్యక్తిని గాని, వస్తువునకు గాని, ప్రదేశమునకు గాని సంజ్ఞలుగా వ్యవహరించు నామవాచకములను సంజ్ఞా నామావాచకము అందురు.

ఉదా :- గోపాలుడు, వారణాశి, లత, కావేరి.

**2. జాతి నామవాచకములు :-**

ఒక జాతికి గాని, వర్గమునకు గాని చెందిన ప్రాణులు లేక వస్తువులకు వ్యవహరింపబడు నామవాచకములు జాతి నామవాచకములనబడును.

ఉదా :- మానవుడు, జంతువు, వృక్షము, నది.

**3. గుణ నామవాచకములు :-**

గుణమును గాని, వర్ణమును గాని, భావమును గాని బోధించు నామవాచకములు గుణ నామవాచకముల గును.

ఉదా : తీపి, చేదు, మంచితనము, గొప్పతనము, ఎరుపు, నలుపు.

**4. క్రియా నామవాచకములు :-**

పనులను తెలియ జేయు నామవాచకములను క్రియా నామవాచకములందురు.

| | | | |
|---|---|---|---|
| ఉదా : | క్రియ | - | క్రియా నామవాచకము |
| | కోరుట | - | కోరిక |
| | తినుట | - | తిండి |
| | కోయుట | - | కోత |

5. సముదాయ నామవాచకములు :-

ఒకే జాతికి చెందిన అనేక ప్రాణుల లేక సముదాయముల పేర్లను సూచించు నామవాచకము సముదాయ నామవాచకములందురు.

ఉదా: ఆవుల మంద     పిట్టల గుంపు
కోతి మూక     లంబాడి తండా

6. ద్రవ్య నామవాచకములు :

ద్రవ్యముల పేర్లను తెలుపు నామవాచకములను ద్ర నామవాచకము లందురు.

ఉదా: నీరు, గాలి, ఇనుము, వెండి, బంగారము.

7. ధాతుజ నామవాచకములు :

ధాతువుల నుండి ఏర్పడిన నామవాచకము ధాతుజ నామవాచకము లందురు.

| ఉదా: ధాతువు | - | ధాతుజ నామవాచకము |
|---|---|---|
| వండు | - | వండుట |
| చేయు | - | చేయుట |
| చేయు | - | చేయుమి |

8. తద్ధిత నామవాచకములు :

తద్ధిత ప్రత్యయములు చేసిన నామవాచకము తద్ధిత నామవాచకము లందురు.

ఉదా: పెద్దతనము, చిన్నతనము, పేరిమి, చెలిమి.

2. సర్వనామములు :

నామవాచకములకు బదులుగా వాడబడు పదము సర్వనామములు.

ఇందు గోపాలుడు అను నామవాచకమునకుబదులుగా వాడబడిన 'అతడు' అను పదము సర్వనామము.

సర్వనామములు 6 విధములు

1. పురుషబోధక సర్వనామములు
2. నిర్దేశాత్మక సర్వనామములు
3. అనిర్దేశాత్మక సర్వనామములు
4. సంబంధ బోధక సర్వనామములు
5. ప్రశ్నవాచక సర్వనామములు
6. సంఖ్యావాచక సర్వనామములు

1. **పురుషబోధక సర్వనామములు :** ప్రథమ, మధ్యమ, ఉత్తమ అను మూడు పురుషలను తెలియ జేయునవి పురుష బోధక సర్వనామములు.

ఉదా :

| | | |
|---|---|---|
| 1. ప్రథమ పురుషము | ఏకవచనము | - బహువచనము |
| పుంలింగము | వాడు | - వారు |
| స్త్రీలింగము | ఆమె | - వారు |
| నపుంసక లింగము | అది | - అవి |
| 2. మధ్యమపురుషము | నీవు | - మీరు |
| 3. ఉత్తమ పురుషము | నేను | - మేము, మనము |

2. **నిర్దేశాత్మక సర్వనామములు :** విషయమును నిర్దేశించి చెప్పు సర్వనామములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదా: | అంత | - ఇంత | అన్ని | - | ఇన్ని |
| | అందరు | - ఇందరు | అతడు | - | ఇతడు |
| | ఆయన | - ఈయన | ఆమె | - | ఈమె |
| | అది | - ఇది | అవి | - | ఇవి |

3. **అనిర్దేశాత్మక సర్వనామములు :** విషయమును నిర్దేశించి

4. క్రియాజన్య విశేషణములు
5. నామజన్య విశేషణములు
6. విధేయ విశేములు

**1.** గుణ విశేషణములు: నామవాచకము యొక్క గుణమును తెలుపు విశేషణమును గుణవిశేషణము అందురు.

ఉదా: గోపాలుడు మంచి విద్యార్థి

**2.** సార్వనామిక విశేషణములు: విశేషణములుగా వాడబడు సర్వనామములను సార్వనామిక విశేషణములందురు.

ఉదా: ఆ సింహము, ఈ బాలుడు, నీ పుస్తకము

**3.** సంఖ్యావాచక విశేషణములు: సంఖ్యలను తెలుపు విశేషణములను సంఖ్యావాచక విశేషణములందురు.

ఉదా: ఒకటి - ఒకరు - ఒకటవ
రెండు - ఇద్దరు - రెండవ

**4.** క్రియాజన్య విశేషణములు: క్రియల నుండి పుట్టిన విశేషణములనుకియాజన్య విశేషణములందురు. వీటిని ధాతుజ విశేషణములని కూడ అందురు.

ఉదా: చదివిన, తినిన, చదువుచున్న - తినుచున్న, చదువగల - తినగల

**5.** నామజన్య విశేషణములు: నామములనుండి పుట్టిన విశేషణములను నామజన్య విశేషణములందురు.
ఉదా: గోపాలుని కలము.

ఇందు 'గోపాలుని' అనునది గోపాలుడు అను నామవాచకము నుండి పుట్టిన విశేషణము కావున ఇది నామజన్య విశేషణమైనది.

6. విధేయ విశేషణము: విధేయముగా నుపయోగింపబడు విశేషణములను విధేయ విశేషణములందురు.
ఉదా: గోపాలుడు గుణవంతుడు.

ఈ వాక్యములో గోపాలుడు నామవాచకము గుణవంతుడు అనునది విధేయము ఇది గోపాలుడు అను నామ వాచకమును విశేషించుచున్నది. కావున ఇది విధేయ విశేషణము.

4. క్రియలు :

పనులను తెలుపు పదములను క్రియలందురు. క్రియలు మూడు విధములు.

అవి: 1. సకర్మక క్రియలు
2. అకర్మక క్రియలు
3. ద్వికర్మక క్రియలు

1. సకర్మక క్రియలు: కర్మతో కూడియున్న క్రియలను సకర్మక క్రియలందురు.

కర్త చేయు పని యొక్క ఫలితమును అనుభవించునది క్రియ.
ఉదా: రాముడు రావణుని చంపెను.

ఈ వాక్యములో 'చంపెను' అనునది క్రియ ఎవరు? అని ప్రశ్నించగా 'రాముడు' అని సమాధానము వచ్చును. కావున రాముడు కర్త. రాముడు ఎవరిని చంపెను. అని ప్రశ్నించగా రావణుని అని సమాధానము వచ్చును. అనగా కర్త చేసిన పనిని అనుభవించిన వాడు కావున రావణుడు కర్మ. ఇందు కర్మ పదముండుటచే 'చంపెను' అను క్రియ 'సకర్మక క్రియ' అయినది.

2. అకర్మక క్రియ: కర్మలేని క్రియలను అకర్మక క్రియ లందురు.

ఉదా: గోపాలుడు చదివెను.

ఈ వాక్యములో చదివెను క్రియ. ఎవరు? అని ప్రశ్నింపగా గోపాలుడు అని సమాధానము వచ్చును. కావున గోపాలుడు కర్త. కాని ఎవరిని, దేనిని అని ప్రశ్నించగా సమాధానము లేదు. అనగా ఈ వాక్యములో కర్మ లేదు. కావున 'చదివెను' అను క్రియ అకర్మక క్రియ.

3. ద్వికర్మక క్రియలు: రెండు కర్మలను కలిగి యున్న క్రియలను ద్వికర్మక క్రియలందురు.

ఉదా: శ్రీకృష్ణుడు ద్రౌపదికి వస్త్రములిచ్చెను.

ఈ వాక్యములో ఇచ్చెను అనునది క్రియ. శ్రీకృష్ణుడు కర్త. ఎవరికి అని ప్రశ్నింపగా ద్రౌపదికి అని, వేనిని అని ప్రశ్నించగా వస్త్రములను అని సమాధానము వచ్చును. కావున అవి రెండును కర్మలు కావున ఇది ద్వికర్మక క్రియ.

## 5. క్రియా విశేషణములు:

క్రియలను విశేషించు పదములను క్రియ విశేషణములందురు.

ఉదా: గోపాలుడు బాగుగా చదువుచున్నాడు.

పై వాక్యములో చదువుచున్నాడు అను పదమ క్రియ. ఎట్లు చదువుచున్నాడు అని ప్రశ్నించన బాగుగా అని సమాధానము వచ్చును. బాగుగా అను పదము చదువుచున్నాడు అను పదమును విశేషించుచున్నది. కావున ఇది క్రియా విశేషణము. క్రియా విశేషణములు నాలుగు విధములు.

అవి : 1. మౌలిక క్రియా విశేషణములు
2. యౌగిక క్రియా విశేషణములు
3. నామజన్య క్రియా విశేషణములు
4. క్రియాజన్య క్రియా విశేషణములు

**1. మౌలిక క్రియా విశేషణములు :-**

ఎల్లప్పుడు క్రియా విశేషణములుగానే ఉపయోగపడు వానిని మౌలిక క్రియా విశేషణములందురు.

ఉదా : అతడు క్రన్నన వచ్చెను.

క్రన్నన అనుపదము మౌలిక క్రియా విశేషణము. ఈ పదము ఎప్పుడు క్రియా విశేషణముగానే ఉపయోగపడును.

**2. యౌగిక క్రియా విశేషణములు :-**

ఇతర పదములపై ' అగు ' ధాతు రూపమైన ' కాన్ ' చేరుట వలన ఏర్పడు క్రియా విశేషణములను యౌగిక క్రియా విశేషణములందురు.

ఉదా : గోపాలుడు వేగముగా పరుగెత్తును.
రాముడు అందముగా మాట్లాడును.
' కాన్ ' రూపాంతరకు ' గా '

**3. నామజన్య క్రియా విశేషణములు :-**

నిమవాచకముల నుండి ఏర్పడిన క్రియా విశేషణము లను నామజన్య క్రియా విశేషణములందురు.

ఉదా : అతడు ఇంటికి వెళ్ళెను
ఆమె ఇక్కడికి వచ్చినది.

**4. ధాతుజ క్రియా విశేషణములు :-**

క్రియలనుండి ఏర్పడిన క్రియా విశేషణములను క్రియాజన్య క్రియా విశేషణములు లేక ధాతుజ క్రియా విశేషణములందురు.

ఉదా : అతడు మాట్లాడక ఉండెను
నేను చదువుతూ వంటిని.

## 6. విభక్తులు :

వాక్యములోని వేర్వేరు పదములకు అన్వయము కలిగించు ప్రత్యయములను, పదములను విభక్తులందురు. ఇవి రెండు పదముల మధ్య సంబంధము కలిగించును.
ఉదా: కుండలో నీరు ఉన్నది.

ఈ వాక్యములో కుండకు నీరుకు గల సంబంధమును సూచించు 'లో' అనునది విభక్తి. దేనినే విభక్తి ప్రత్యయముందురు.

విభక్తులు 8 విధములు

1. ప్రథమా విభక్తి - డు,ము,వు,లు
2. ద్వితీయా విభక్తి - నిన్, నున్, లన్, కూర్చి, గురించి
3. తృతీయా విభక్తి - చేతన్ చేన్, తోడన్ తోన్
4. చతుర్థీ విభక్తి - కొరకున్, కై
5. పంచమీ విభక్తి - వలనన్, కంటెన్, పట్టి
6. షష్ఠీ విభక్తి - కిన్, కున్, యొక్క, లోన్, లోపలన్
7. సప్తమీ విభక్తి - అందున్, ఇందున్, నన్
8. సంబోధనా ప్రథమా విభక్తి - ఓ, ఓయి, ఓరి, ఓసి

## 7. సముచ్ఛయములు :

పదములను ఒక దానితో నొకటి కలుపుటకు ఉపయోగపడు వానిని సముచ్ఛయములందురు. సముచ్ఛయములు - రెండు అవి యున్, నున్.

ఉదా: రాముడును, లక్ష్మణుడును అయోధ్యకు వచ్చిరి.
సత్యయు, హరియు ద్వాకకువచ్చిరి.

వ్యవహారికభాషలో సముచ్చయములను వాడుట లేదు. వీటికి బదులు దీర్ఘములు వ్రాయుచున్నారు.

ఉదా: రాముడూ కృష్ణుడూ వచ్చారు.

8. ఆశ్చర్యాద్యర్థకములు :

ఆశ్చర్యము, సంతోషము, భయము, జుగుప్స విషాదము మున్నగు వానిని తెలిపెడి పదములను ఆశ్చర్యాద్యర్థకములందురు.

ఉదా: ఆహా రాముడు ఎంత మంచివాడు
అయ్యో! నీకు ఎంత కష్టము కలిగినది
అమ్మో! నాకు భయము
ఛీ! ఛీ! నీమొగము నాకు చూపించకు

9. అవ్యయములు :

లింగ, వచన, విభక్తి శూన్యములైన పదములను అవ్యయములందురు.

అనగా స్త్రీ అంగము, పుంలింగము, నపుంసకలింగము వలనగాని, ఏకవచన, బహువచనముల వలన గాని విభక్తుల వలన గాని ఏమార్పులను పొందని పదములు అవ్యయములని గుర్తించవలెను.

అవ్యయములు 2 రకములు
1. లాక్షణికములు
2. ప్రతి పదోక్తములు.

1. లాక్షణికములు :-

వ్యాకరణ కార్యముల వలన సాధింపబడిన అవ్యయములు లాక్షణి కావ్యయములు.

ఉదా: చూచి - తిని, చూడక - తినక, చూచిన - తినిన.

2. ప్రతి పదోక్తావ్యయములు :

పుట్టుకతోనో లింగవచన విభక్తులు లేనివియును, వాడుకలో అంగాదులను విడిచి వేరొక అర్థములో ఉపయోగపడుచున్న శబ్దములను ప్రతిపదోక్తావ్యయము లందురు.

ఉదా : కాని, అయినన్, కాబట్టి, కనుకన్, బాగుబాగు, నీకె, నీవైనన్, అయ్యో! అక్కటా!

## నాల్గవ భాగము

1. లింగములు :

స్త్రీ పురుషాది జాతిభేదమును 'లింగము' అందురు. దీనినే వాచకము అనికూడ అందురు. తెలుగులో మూడు లింగములు కలవు.

1. పుంలింగము - మహద్వాచకము లేక మహత్తు
2. స్త్రీ లింగము - మహతీవాచకము లేక మహతి
3. నపుంసక లింగము - అమహద్వాచకము లేక అమహత్తు

1. పుంలిగము :

పురుషులను వారి విశేషములను గూర్చి తెలుపునవి పుంలింగములు.

ఉదా : రాముడు, గోపాలుడు, కృష్ణుడు గుణవంతుడు, శీలవంతుడు, బుద్ధిమంతుడు.

2. స్త్రీ లింగము :

స్త్రీలను వారి విశేషణములను గూర్చి తెలుపునవి స్త్రీ లింగములు.

ఉదా : పార్వతి, సచత, గౌరి
గుణవంతురాలు, శీలవంతురాలు, బుద్ధిమంతురాలు

3. నపుంసక లింగము :

పుంలింగములు స్త్రీలింగములు కానివి నపుంసకలింగములు. వృక్షములు, జంతువులు చలనము లేచి వస్తువులు వాని విశేషణములు నపుంసక లింగములగును.

ఉదా : గోవు, వృక్షము, కుక్క, బల్ల, మేక, పులి, ఏనుగు

## 2. వచనములు

ఒకటికిని, ఒకటి కంటె ఎక్కువగా నుండుటకును గల భేదమును తెలుపుటను వచనము అందురు. వచనములు-4.

1. ఏకవచనము

ఒక వ్యక్తిని గాని, ఒక వస్తువును గాని బోధించు దానిని ఏకవచనమందురు.

ఉదా : కలము, చెట్టు, పర్వతము, నది

2. బహువచనము

ఒకటి కంటె ఎక్కువ మంది వ్యక్తులను గాని వస్తువులను గాని బోధించు దానిని బహువచనమందురు.

ఉదా : కలములు, చెట్లు, పర్వతములు, నదులు.

3. నిత్యైకవచనములు

కొన్ని పదములు ఎపుడును ఏకవచనములుగానే ఉండును. వాటిని నిత్యైక వచనములందురు.

ఉదా : వరి, రాగి, పెసర, కంది, బంగారము, రాగి, వెండి, ఉప్పు, నూనె మొదలగునవి.

4. నిత్యబహువచనములు –

కొన్ని పదములు కేవలము బహువచనములోనే ఉండును. అట్టి వానిని నిత్యబహువచనములందురు.

ఉదా : గోధుమలు, జొన్నలు, పెసలు, మినుములు, కందులు, దాగుడుమూతలు అందరు. ఎందరు, కొందరు మొదలగునవి.

# 3. ధాతువులు

క్రియయొక్క మూల రూపము ధాతువు

ధాతువులు మూడు విధములు

1. తత్సమ ధాతువులు
2. ఆచ్ఛిక ధాతువులు
3. శబ్దపల్లవములు

## 1. తత్సమ ధాతువులు :-

సంస్కృతము నుండి వచ్చిన ధాతువులను తత్సమ ధాతువులందురు.

ఇవి రెండు విధములు

1. తత్సమ క్రియాధాతువులు
2. తత్సమ నామ ధాతువులు

### 1. తత్సమ క్రియా ధాతువులు :

సంస్కృత ధాతువులకు 'ఇంచు'చేరుట వలన ఏర్పడిన ధాతువులను తత్సమ క్రియా ధాతువు లందురు.

**ఉదా :** భజ్ + ఇంచు = భజించు

భుజ్ + ఇంచు = భుజించు.

### 2. తత్సమ నామ ధాతువులు :

సంస్కృత నామములకు' ఇంచు 'చేరుట వలన ఏర్పడిన ధాతువులను తత్సమనామ ధాతువులందురు.

**ఉదా :** శయన + ఇంచు = శయనించు

పల్లవ + ఇంచు = పల్లవించు.

## 2. ఆచ్ఛిక ధాతువులు :

తద్భవ దేశ్యపదములు గల భాష అచ్చతెలుగు

భాష యగును. అచ్చ తెలుగుపదములతో ఏర్పడిన ధాతువులు ఆచ్ఛిక ధాతువులు.
ఉదా : తిను, కను, విను మొదలగునవి మేలిక ధాతువులు

ఆరగించు, ఆవులించు, చిగురించు, పయనించు మున్నగు 'ఇంచు' చేరగా ఏర్పడిన ధాతువులు ఆచ్ఛిక ధాతువులు అగును.

3. శబ్దపల్లవములు :

ధాతువు పై గాని నామము పై గాని వేరొక ధాతువు చేరి వేరే అర్థము నిచ్చు సంయుక్త ధాతువును శబ్ద పల్లవ మందురు.
ఉదా : కూర్చు + ఉండు = కూర్చుండు.

పై పదములో 'కూర్చు' అనునది ఒక ధాతువు, దానికి 'ఉండు' అనుమరొక ధాతువుచేరి 'కూర్చుండు' అను శబ్దపల్లవమైనది.

ఇట్లే మేలు + కొను = మేలుకొను, మేల్కొను.
నిలుచు + ఉండు = నిలుచుండు.
అందు + ఇచ్చు = అందిచ్చు మున్నగునవి.

## 4. తద్ధితములు

నామవాచకములకు చివర చేరు ప్రత్యయములనుతద్ధిత ప్రత్యయములందురు. తద్ధితప్రత్యయములు చేరిన నామములు తద్ధితములగును.

నామముల చివర తద్ధిత ప్రత్యయములు ఈ క్రింది అర్థములలో చేరును.

## 1. భావార్థకము :

1. భావార్థకమున ' తన ' ప్రత్యయము వచ్చును.

ఉదా : గొప్ప + తనము = గొప్పతనము

రాముని + తనము = రామునితనము.

నామవాచకముల విశేషణముల ధర్మమునుతెలుపునది భావార్థకము.

2. ' చిన్న ' మున్నగు వానికి (ఱ) రికవర్గకము వచ్చును.

ఉదా : చిన్న + రికము = చిన్నరికము.

పెద్ద + రికము = పెద్దరికము.

కన్నె + రికము = కన్నెరికము.

3. పేరు మొదలగువానికి ' ఇవి ' వర్గకము వచ్చును.

ఉదా : పేరు + ఇమి = పేరిమి

చెలి + ఇమి = చెలిమి.

కడు + ఇమి = కడిమి.

4. ' ఇక ' వర్గకము అగ్గలాదులకు వచ్చును.

ఉదా : అగ్గలము + ఇక = అగ్గలిక

ఒమ్ము + ఇక = ఒమ్మిక.

5. గుణమును తెలుపు ' నల్ల 'మున్నగువాటికి ' న ' వచ

ఉదా : నల్ల + న = నల్లన

తెల్ల + న = తెల్లన.

## 2. స్వార్థము :

స్వార్థములో తద్ధిత ప్రత్యయములు చేరినప్పటి అర్థము మారదు.

స్వార్థములో ఈ క్రింది ప్రత్యయములు వచ్చును.

1. ఇక - వర్ణకము అరమారాదులకు వచ్చును.
   ఉదా: అరమర + ఇక = అరమరిక
   నడవడి + ఇక = నడవడిక.

2. ఉక - వర్ణకము చి(ఱు) రు తాదులకు వచ్చును.
   ఉదా: చిరుత + ఉక = చిరుతుక
   నాతి + ఉక = నాతుక.

3. ఇడి - వర్ణకము 'తెలివి' మున్నగు వానికి వచ్చును.
   ఉదా: తెలివి + ఇడి = తెలివిడి
   వినికి + ఇడి = వినికిడి.

4. ఇలి - వర్ణకము 'వాపు' మున్నగు వానికి వచ్చును.
   ఉదా: వాపు + ఇరి = వాపిరి
   వావు + ఇరి = వావిరి.

5. ఇద వర్ణకము 'ఒప్పు' మున్నగు వానికి వచ్చును.
   ఉదా: ఒప్పు + ఇదము = ఒప్పిదము
   తప్పు + ఇదము = తప్పిదము.

6. కార వర్ణకము 'నుడి' మున్నగు వానికి వచ్చును.
   ఉదా: నుడి + కారము = నుడికారము
   కొలత + కారము = కొలగారము.

## 3. మతుబర్థకము :

కలది, కలవాడు అనునర్థమును మతుబర్థకము అందురు.

మతుబర్థమున నామములపై ఈ క్రింది ప్రత్యయములు వచ్చును.

1. 'ఆట' మొదలగువానికి పురుషులనుతెల్పునపుడు 'కా' అనియు, స్త్రీ లను తెల్పునపుడు 'కత్తియ' అనియు వచ్చును.

ఉదా: ఆట + 'కా'డు = ఆటకాడు
సొగసు + 'కా'డు = సొగసుగాడు
ఆట + 'కత్తియ' = ఆటకత్తియ
సొగసు + కత్తియ = సొగసుకత్తియ.

2. అటమటాదులకు పుంలింగములో 'ఈ'వర్ణకమువచ్చును.
ఉదా: అట + మట 'ఈ' = అటమటీడు
సొలె + 'ఈ' డు = సొలీడు.

3. కులమును తెలుపు పదములకు 'త'వర్ణకము వచ్చును.
ఉదా: బోయ + త = బోయత
చెంచు + త = చెంచెత.

4. బహు వచనములు చివర నున్నవగాదులకు 'ఆ' వర్ణకము వచ్చును.
ఉదా: వగలు + ఆడు = వగలాడు
వన్నెలు + ఆడు = వన్నెలాడు.

5. లేనిది, లేనివాడు అను అర్థములో ముక్కు మున్నగు వానికి 'ఇడి' వర్ణకము వచ్చును.
ఉదా: ముక్కు + ఇడి = ముక్కిడి
సిగ్గు + ఇడి = సిగ్గిడి.

6. జాలాదులకు అరి వర్ణకము వచ్చును.
ఉదా: జాలము + అరి = జాలరి.
జూదము + అరి = జూదరి.

7. 'ఒయ్యారము' మున్నగు పదములను 'ఇ' వర్ణకము వచ్చును.
ఉదా: ఒయారము = ఇ + ఒయారి
జోహారము + ఇ = జోహారి.
కడలు + ఇ = కడలి.

4. మానార్థకము :-

పరిమాణము, కొలతను తెలియ జేయు అర్థమును మానార్థకమందురు. మానార్థకములో ఈ క్రింది ప్రత్యయములు వచ్చును.

1. మానార్థకమున ఏక వచనములో 'ఏడు' వర్ణకము వచ్చును.

ఉదా: తూము + ఎడు = తూమెడు

ముంత + ఎడు = ముంతెడు.

'అంత' వర్ణకము చేసిన

ఉదా: చేట + అంత = చేటంత

నిమ్మకాయ + అంత = నిమ్మకాయంత.

5. దఘ్నార్థకము :

లోతును తెలియజేయునది దఘ్నార్థకము దఘ్నార్థములో 'బంటి', కొలది ప్రత్యయములు వచ్చును.

ఉదా: మోకాలు + బంటి = మోకాలుబంటి

మోకాలు + కొలది = మోకాలుకొలది.

6. తాచ్ఛీల్యార్థము

అతని స్వభావము అను నర్థమును తెలియ జేయునది తాచ్ఛీల్యార్థము.

తాచ్ఛీర్యార్థమున పోతు, మారి, కోరు, దారు, గొట్టు అను ప్రత్యయములు చేరును.

ఉదా: పోతు — తిండి + పోతు = తిండిపోతు.

పొగరు + పోతు = పొగరుబోతు

మారి — మాయలు + మారి = మాయలమారి

మాటలు + మారి = మాటలమారి

కోరు — జగడాలు + కోరు = జగడాలకోరు
దగా + కోరు = దగాకోరు.
దారు — పెత్తనము + దారు = పెత్తనదారు, పెత్తందారు.
గొట్టు — పిసిని + గొట్టు = పిసినిగొట్టు.

# 5. కృదంతములు

ధాతువులపై చేరు ప్రత్యయములను కృత్తులు లేక కృతత్యయములు అందురు. కృత్తులు చేరగా ఏర్పడిః నామవాచకములను కృదంతములందురు.

కృత్ + అంతము = కృదంతము.

1. 'అలుగు' మున్నగు ధాతువులకు 'క' వర్ణకము వచ్చును.
ఉదా: కలుగు + ఇమి = కలిమి
ఓరు (చు) + ఇమి = ఓరిమి.

2. 'కలుగు' మున్నగువానికి 'ఇమి' వర్గకము వచ్చును.
ఉదా: కలుగు + ఇమి = కలిమి
ఓరు (చు) + ఇమి = ఓరిమి

3. 'చేయు' మున్నగు వానికి 'త' వర్ణకము వచ్చును.
ఉదా: చేయు+త = చేత
కూయు + త = కూత.

4. 'అడగు' మున్నగు వానికి 'కువ' వర్ణకము వచ్చును.
ఉదా: అడగు + కువ = అడకువ
లోగు + కువ = లోకువ.

5. 'ఆడు' మున్నగు వానికి 'ట' వచ్చును.
ఉదా: ఆడు + ట = ఆడుట
ఊరు + ట = ఊట.

6. తిరియు మున్నగు వానికి 'ప వచ్చును.

ఉదా: తిరియు, + ప = తిరిపము

మురియు + ప = మురిపెము.

ఇవి నపుంసక లింగ శబ్దములగుటచే ము వచ్చినది.

7. ఆవులించు మున్నగు వానికి 'త' వచ్చును.

ఉదా: ఆవులిం(చు) + త = ఆవులింత.

వెక్కిరిం(చు) + త = వెక్కిరింత.

8. 'మాయు' మున్నగువానికి 'పు' వచ్చును.

ఉదా: మా(యు) + పు = మాపు

మే(యు) + పు = మేపు.

9. 'అంజు' మున్నగు వానికి 'ఇక' వచ్చును.

ఉదా: అంజు + ఇక = అంజిక

అమరు + ఇక = అమరిక.

10. 'ఏలు' మున్నగు వానికి 'బడి' వచ్చును.

ఉదా: ఏలు + బడి = ఏలుబడి

కట్టు + బడి = కట్టుబడి.

11. 'చేరు' మున్నగువానికి 'గడ' వచ్చును.

ఉదా: చేరు + గడ = చేరు గడ

మను + గడ = మనుగడ.

12. 'కోరు' మున్నగువానికి 'ఇకి' వచ్చును.

ఉదా: కోరు + ఇకి = కోరికి

పోలు + ఇకి = పోలికి.

13. 'మను' మున్నగు వానికి 'వు' వచ్చును.

ఉదా: మను + వు = మనువు

కాబు + వు = కావు.

14. ' మా(ఱు) రు ' మున్నగువానికి ' అక ' వచ్చును.
ఉదా: మారు + అక = మారకము.
అమ్మ + అక = అమ్మకము.

15. ' కలియు ' మున్నగు ధాతువులను ' విడి ' వచ్చును.
ఉదా: కలి(యు) + విడి = కలివిడి
తెలుయు + విడి = తెలివిడి.

16. ' కాచు ' మున్నగు వానికి ' వలి ' వచ్చును.
ఉదా: కాచు + వలి = కావలి.
వీచు + వలి = వీవలి.

17. ' తెలియు ' మున్నగు వానికి ' వి ' వచ్చును.
ఉదా: తెలి(యు) + వి = తెలివి
తని(యు) + వి = తనివి.

18. ' కాచు ' మున్నగు వానికి ' పుర ' వచ్చును.
ఉదా: కా(చు) + పుర = కాపురము
దా(చు) + పుర = దాపురము.

19. ' దిగు ' మున్నగు వానికి ' మతి ' వచ్చును.
ఉదా: దిగు + మతి = దిగుమతి
ఎగు + మతి = ఎగుమతి.

20. పెట్టు మున్నగు వానికి బడి వచ్చును.
ఉదా: పెట్టు + బడి = పెట్టుబడి
దిగు + బడి = దిగుబడి.

# ఐదవ ప్రకరణము
# సంధులు

## 1. సంధి

సంధి అనగా రెండు పదముల కలయిక మొదటి పదము లోని చివరి అచ్చు పోయి రెండవ పదములోని మొదటి అచ్చు వచ్చిన సంధి అగును.

ఉదా: రాముడు + అతడు = రాముడతడు.

'ఇందు' 'రాముడు' మొదటి పదము అతడు రెండవ పదము. మొదటి పదమైన 'రాముడు' లోని ఉకారము పోయి రెండవ పదములోని 'అ' కారము వచ్చినది.

రాముడ్ + అతడు = రాముడతడు అయినది.

## 2. సంధి కార్యములు

1. ఏకాదేశము: రెండు వర్ణములకు బదులు ఒకే వర్ణము వచ్చుటను ఏకాదేశమందురు.

   ఉదా: గోపాలుడు + అతడు = గోపాలుడతడు.

   ఇందు మొదటి పదములోని చివరి ఉకారము పోయి రెండవ పదములోని మొదటి అకారము ఏకాదేశముగా వచ్చినది.

2. ఆదేశము: ఒక అక్షరమును తొలగించి వేరొక అక్షరము వచ్చుటను ఆదేశమందురు.

   ఉదా: నీవు + టక్కరివి = నీవుడక్కరివి.

   ఇందు 'ట' కు 'డ' ఆదేశముగా వచ్చినది.

3. ఆగమము: రెండు పదముల మధ్య మరొక అక్షరము చేరుటను ఆగమము అందురు.

ఉదా: నీ + కరుణ = నీదుకరుణ.

ఇందు 'దు' ఆగమముగా వచ్చినది.

4. నిత్యము: సంధి కార్యము తప్పని సరిగా వచ్చిన నిత్యమందురు.

ఉదా: రామ + అయ్య = రామయ్య.

5. వైకల్పికము (విభాష): సంధి కార్యము ఒకసారి వచ్చుట, మరొకసారి రాకపోవుటను వైకల్పికము లేక విభాష అందురు.

ఉదా: మేన + అత్త = మేనత్త, మేనయత్త.

సంధి జరిగినపుదు 'మేనత్త' అయినది. సంధి జరుగునపుదు 'య' ఆగమముగా వచ్చి 'మేనయత్త' అయినది.

6. బహుళము: సంధి కార్యము ఒకసారి నిత్యముగాను, మరొకసారి వైకల్పికము గాను, ఒకసారి సంధి రాకుండుటను, మరొకసారి వేరే విధముగా వచ్చుటను బహుళము అందురు.

ఉదా: రామ + అయ్య = రామయ్య (నిత్యము)
మేన + అత్త = మేనత్త, మేనయత్త (వైకల్పికము)
వనిత + ఆమె = వనితయామె (సంధిరాకుండట)
సంధిరాకపోవుటచే 'య' ఆగమముగా వచ్చినది
ఒక + ఒక = ఒకానొక (వేరే విధముగా వచ్చినది)

7. ఆమ్రేడితము : ఒక పదమును రెండు సార్లు చెప్పిన రెండవ పదమును ఆమ్రేడితమందురు.

ఉదా : జేర + జేర = జౌరార

ఇందు రెండవ 'జౌర' ఆమ్రేడితము

8. ద్విరుక్తము : రెండుసార్లు చెప్పబడిన పదమును ద్విరుక్తము అందురు.

ఉదా : ఓహో + ఓహో = ఓహోహో

ఇందు 'ఓహో' అనుపదము రెండుసార్లు చెప్పబడినది. కావున అది ద్విరుక్తము.

9. ద్విత్వము : ఒక హల్లు క్రింద హల్లువచ్చిన ద్విత్వము అందురు.

ఉదా : అన్న, అక్క, ఇందు 'న్న' 'క్క' అను అక్షరములు ద్విత్వములు.

10. సంయుక్తము : ఒక హల్లుతో వేరొక హల్లుచేరిన సంయుక్తమగును

ఉదా : పద్యము. ఇందు 'ద్య' సంయుక్తాక్షరము.

11. సంశ్లేషము : సంధి జరుగునపుడు మొదటి పదము చివరి హల్లు రెండవ పదము మొదటి హల్లుతో చేరిన సంశ్లేషమగును.

ఉదా : కృష్ణున్ + గొలిచెద = కృష్ణున్గొలిచెద.

ఇందు 'న్గ' సంశ్లేషము.

12. లోపము : పదములో అక్షరము లోపించుటను లోపము అందురు.

ఉదా : వచ్చెను + గోవులు = వచ్చెగోవును.

ఇందు 'ను' లోపించినది.

# 3. తెలుగుసంధులు

అచ్చ తెలుగుపదములకు జరుగు సంధులను తెలుగుసంధులు అందురు.

**1. అకారసంధి :**

అకారమునకు సంధి బహుళముగా వచ్చును.

ఉదా : మేన + అల్లుడు = మేనల్లుడు, మేనయల్లుడు

పుట్టిన + ఇల్లు = పుట్టినిల్లు, పుట్టినయిల్లు

**2. ఇకారసంధి :**

1. 'ఏమి' మున్నగువానికి సంధి వైకల్పికముగా వచ్చును.

ఉదా : ఏమి + అంటివి = ఏమంటివి, ఏమియంటివి.

హరికి + ఇచ్చె = హరికిచ్చె, హరికినిచ్చె.

2. క్రియా పదములందు ఇకారమునకు సంధి వైకల్పికముగా వుచ్చును.

ఉదా : వచ్చిరి + అపుడు = వచ్చిరపుడు, వచ్చిరియపుడు.

3. మధ్యమ పురుష క్రియలందు ఇకారమునకు సంధి యగును.

ఉదా : ఏలితివి + అపుడు = ఏలితివపుడు

క్త్వార్థంబైన ఇత్తునకు (ఇకారమునకు) సంధిలేదు.

ఉదా : వచ్చి + ఇచ్చెను = వచ్చియిచ్చెను.

ఇచట సంధి రాకపోవుటచే 'య' ఆగమముగా వచ్చినది.

3. ఉకారసంధి :

ఉత్తు(ఉకారము)నకు అచ్చు పరమగునపుడు సంధియగును.

ఉధా : రాముడు + అతడు = రాముడతడు.

అతడు + ఎక్కడ = అతడెక్కడ.

4. త్రికసంధి : 'ఆ ఈ ఏ'లు త్రికములు.

1. త్రికముల మీద వచ్చిన అసంయుక్త హల్లునకు ద్విత్వము బహుళముగా వచ్చును.

ఉదా : ఆ + కన్య = ఆ + కన్య

ఇందు 'ఆ' త్రికము 'క' అసంయుక్త హల్లు కావున 'క'కు ద్విత్వము వచ్చి ఆ + క్కన్య అయినది.

2. ద్విరుక్తమైన హల్లు పరమైనపుడు దీర్ఘమునకు హ్రస్వమువచ్చును.

ఉదా : ఆ + క్కన్య = అక్కన్య.

ఇందు ద్విరుక్తమైన 'క్క' పరమైనది కావున దీర్ఘమైన 'ఆ' హ్రస్వముగా మారి 'అక్కన్య' అయినది.

5. యడాగమ సంధి :

సంధి లేనిచోట స్వరము కంటె పరమైన స్వరమునకు 'య' ఆగమముగా వచ్చును.

ఉదా : మా + అమ్మ = మా + య్ + అమ్మ = మాయమ్మ

మీ + ఊరు = మీ + య్ + ఊరు = మీయూరు.

6. టుగాగమ సంధి:

1. కర్మధారయమునందు ఉత్తునకు అచ్చు పరమగునపుడు 'టు' ఆగమముగా వచ్చును.

ఉదా: నిగ్గు + అద్దము = నిగ్గు + ట్ + అద్దము = నిగ్గుటద్దము.

2. కర్మధారయమునందు 'పేరు' మున్నగు శబ్దములకు అచ్చు పరమగునపుడు 'టు' గాగమము విభాషగా వచ్చును.

ఉదా: పేరు + ఉరము = పేరు + ట్ + ఉరము
= పేరుటురము.

టుగాగమము రానిచో పేరురము అగును.

చిగురు + ఆకు = చిగురు + ట్ + ఆకు = చిగురుటాకు.

7. రుగాగమ సంధి:

1. కర్మధారయమునందు పేదాది శబ్దములకు 'ఆలు' శబ్దము పరమైనపుడు 'రు'గాగమము వచ్చును.

ఉదా: పేద + ఆలు = పేద + ర్ + ఆలు = పేదరాలు
బీద + ఆలు = బీద + ర్ + ఆలు = బీదరాలు.

2. కర్మధారయమునందు తత్సమములకు 'ఆలు' శబ్దము పరమగునపుడు అత్వమునకు ఉత్వము రుగాగమము వచ్చును.

ఉదా: ధీర + ఆలు = ధీరు + ఆలు (అత్వమునకు ఉత్వము)
ధీరు + ర్ + ఆలు = ధీరురాలు
అట్లే గుణవంత + ఆలు = గుణవంతురాలు

8. నుగాగమ సంధి :

1. ఉదంత తద్ధర్మార్థ విశేషణమునకు అచ్చు పరమగునపుడు నుగాగమము అగును.

ఉదా: చేయు + అతడు = చేయు + న్ + అతడు
= చేయునతడు
వచ్చు + అతడు = వచ్చు + న్ + అతడు
= వచ్చునతడు.

2. షష్ఠీ సమాసమునందు ఉకార, ఋ కారములకు అచ్చు పరమగునపుడు 'ను' గాగమము వచ్చును.

ఉదా: రాజు + ఆజ్ఞ = రాజు + న్ + ఆజ్ఞ = రాజునాజ్ఞ
రాజునాజ్ఞ - రాజు యొక్క ఆజ్ఞ - షష్ఠీ సమాసము.

3. ఉదంత స్త్రీ సమములకును పుం,పులకును పరుష సరళములు పరమగునపుడు నుగాగమము వచ్చును.

ఉదా: తళుకు + గజ్జెలు
తళుకు + (ను) + గజ్జెలు = తళుకున్గజ్జెలు
సింగపు + కొదమ - ద్రుతసంధి జరిగి
సింగపు + ను + కొదమ = సింగపుంగొదమ
సింగపుగొదమ
సింగపున్గొదమ

4. ఉదంత స్త్రీ సమములకును, అదంత గుణవాచకముల కును పుం,పు లకును 'తనము' పరమగునపుడు నుగాగమమువచ్చును.

ఉదా: తెల్ల + తనము = తెల్ల + న్ + తనము
ద్రుతసంధి జరిగి = తెల్లందనము తెల్లదనము
తెల్లన్దనము

సొగసు + తనము
సొగసు + న్ + తనము = సొగసుందనము
సొగసుదనము
సొగసున్దనము

9. దుగాగమ సంధి:

నీ, నా, తన శబ్దములకు ఉత్తరపదము పరమగునపుడు 'దు' గాగమము విభాషగావచ్చును.

ఉదా: నీ + కరుణ = నీ + దు + కరుణ = నీదుకరుణ

'దు' గాగము రానిచో - నీకరుణ

నా + శక్తి = నా + దు + శక్తి = నాదుశక్తి, నాశక్తి

తన + చూపు = తన + దు + చూపు = తనదుచూపు తనచూపు.

10. ద్విరుక్తటకార సంధి:

కుఱు, చిఱు, కడు నడు నిడు శబ్దముల 'ఱ' 'డ'ల కచ్చు పరమగునపుడు ద్విరుక్తటకారము ఆదేశముగా వచ్చును.

ఉదా: కుఱు + ఉసురు = కు + ట్ట్ + ఉసురు = కుట్టుసురు
చిఱు + ఎలుక = చి + ట్ట్ + ఎలుక = చిట్టెలుక
కడు + ఎదురు = క + ట్ట్ + ఎదురు = కట్టెదురు
నడు + అడవి = న + ట్ట్ + అడవి = నట్టడవి
నిడు + ఊర్పు = ని + ట్ట్ + ఊర్పు = నిట్టూర్పు.

11. గసడదవాదేశ సంధి:

1. ప్రథమ మీది పరుషములకు గసడదవలు బహుళముగా నగును.

ఉదా: వాడు + కొట్టె = వాడుగొట్టె, వాడుకొట్టె
వారు + చనియె = వారుజనియె, వారుచనియె
నీవు + టక్కరివి = నీవుడక్కరివి, నీవుటక్కరివి
మీరు + తలదు = మీరుదలదు, మీరుతలదు
వారు + పోరు = వారువోరు, వారుపోరు

2 వళకు క్రియా పదముల మీది పరుషములకు సరళములగును.

ఉదా: రారు + కదా = రారుగదా, రారుకదా
వత్తురు + పోదురు = వత్తురువోదురు, వత్తురుపోదురు

3 ద్వంద్వము నందు పదముపై పరుషములకు గసడదవలగును.

ఉదా: కూర + కాయ = కూరగాయలు
కాలు + చేతు = కాలుసేతులు
టక్కు + టెక్కు = టక్కుడెక్కులు
తల్లి + తండ్రి = తల్లిదండ్రులు
ఊరు + పల్లె = ఊరువల్లెలు

4. తెలుగు మీది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు.

ఉదా: వాడు + కంసారి = వాడుకంసారి
వీడు + చక్రపాణి = వీడుచక్రపాణి
అది + తథ్యము = అదితథ్యము

ద్రుతసంధి:

ద్రుతప్రకృతికముల మీది పరుషములకు సరళము లగును.

ఉదా: పూచెను + కలువలు = పూచెనుగలువలు

2. ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషగానగును.

ఉదా: పూచెను + గలువలు = పూచెగలువలు
పూచెం గలువలు
పూచెన్గలువలు

3. ద్రుతమునకు సరళ స్థిరములు పరమగునపుడు లోపసంశ్లేషలు విభాషగానగును.

ఉదా: వచ్చెను + గోవులు = వచ్చెగోవులు
వచ్చెన్గోవులు
వచ్చెనుగోవులు

4. తాను నేను పదముల ద్రుతమునకు సంశ్లేషము లేదు.

ఉదా: తాను + చదివె = తాజదివె
తానుజదివె

నేను + కంటిని = నేగంటిని
నేనుగంటిని

5. సమాసము నందు ద్రుతమునకు లోపమగును.

ఉదా: ఎల్లన్ + అర్థములు = ఎల్లయర్థములు
ఎల్లన్ + కలుషములు = ఎల్లకలుషములు

6. సమాసము నందు ద్రుతమునకు స్వత్వము లేదు.

ఉదా: చిగురున్ + కైదువు = చిగురు గైదువు
తళుకున్ + గజ్జెలు = తళుకు గజ్జెలు

చిగురును గైదువు, తళుకును గజ్జెలు అను రూపములుండవు.

13. పుంప్వాదేశ సంధి :

కర్మధారయ సమాసము నందు ముువర్ణమునకు పంపులగును.

ఉదా : సరసము + మాట = సరసపుమాట, సరసంపుమాట

విరసము + వచనము = విరసపువచనము

14. ఆమ్రేడిత సంధి :

1. ఆమ్రేడితము పరమగునపుడు కడాదుల తొలియచ్చు మీది వర్ణముల కెల్ల అవంత ద్విరుక్త టకారమగును.

ఉదా : కడ + కడ = కట్టకడ

చివర + చివర = చిట్టచివర

2. అచ్చునకు ఆమ్రేడితము పరమగునపుడు సంధి తరచుగానగును.

ఉదా : ఔర + ఔర = ఔరౌర

ఆహా + ఆహా = ఆహాహా

15. ప్రాతాది సంధి :

సమాసమున ప్రాతాదుల తొలి యచ్చు మీది వర్ణముల కెల్ల లోపము బహుళముగానగును.

ఉదా : ప్రాత + ఇల్లు = ప్రాయిల్లు, ప్రాతయిల్లు

లేత + దూడ = లేదూడ, లేతదూడ

16. పడ్వాది సంధి :

పడ్వాదులు పరంబగునపుడు ముువర్ణమునకు లోప పూర్ణబిందువులు విభాషగానగును.

ఉదా : భయము + పడె = భయపడె

భయంపడె

భయముపడె

17. ఉలనల సంధి:

"ఉ, ల, న" లు పరమగునపుడు 'ము' వర్ణమునకు లోపము, తత్పూర్వస్వరమునకు దీర్ఘము విభాషగానగును.

ఉదా: వజ్రము + లు = వజ్రాలు, వజ్రములు

వజ్రము + లను = వజ్రాలను, వజ్రములను

వజ్రము + న = వజ్రాన

18. బహువ్రీహి సమాససంధి;

బహువ్రీహి సమాసమున స్త్రీ విచకమైనచో ఉపమానము మీది 'మేను' శబ్దమునకు 'పోడి' అగును.

ఉదా: అలరు + మేను = అలరు + పోడి

అలరు + ను + పోడి = అలరుబోడి

పూవు + మేను = పూవు + పోడి

పూవు + ను + పోడి = పూబోడి

19. ముపర్గలోప సంధి:

మధ్యమ పురుషము వర్గమునకు హలవ సానములు పరమగునపుడు లోపము విభాషగానగును.

ఉదా: చూడుము + నన్ను = చూడనన్ను, చూడుమునన్ను

ఇటు + చూడుము = ఇటుచూడు, ఇటు చూడుము

20. అల్లోప సంధి:

అది, అవి శబ్దముల అత్తునకు వృత్తిని (సమాసములో) లోపము బహుళముగానగును.

ఉదా: నా + అది = నాది, నాయది

నా + అవి = నావి, నాయవి.

యడాగమము వచ్చి నాయది, నాయవి అను రూపములయినవి.

**21. అనుకరణ సంధి:**

1. అనుకరణమున విసర్గకు లోపమగును.

ఉదా: శ్రీః + అనియె = శ్రీయనియె

2. అనుకృతిని నమః శబ్దము యొక్క తుది అత్తుకు ఓత్యము విభాషనగును.

ఉదా: నమః + అనె = నమోయనె, నమాయనె

3. అనుకరణము నందు తుది హల్లునకు ద్విత్యమగును.

ఉదా: కింతత్ + అనియె = కింతత్తనియె

కస్త్వమ్ + అనియె = కిస్త్వమ్మనియె

**2. అలిగాగమ సంధి;**

సమాసము నందు అంద్వాదులకు అలిగాగమమగును.

ఉదా: నాయందు + కరుణ = నాయందు + అలి + కరుణ = నాయంలికరుణ

ఇందు + జనులు = ఇందు + అలి + జనులు = ఇందలిజనులు

**23. అపదాదిస్వర సంధి:**

అంద్వవగాగమములు తప్ప అపదాదిస్వరము పరమగునపుడు అచ్చునకు సంధియగును.

ఉదా: మూర + ఎడు = మూరెడు

వచసె + ఎడు = వీసెడు

అర్ధ + ఇంబు = అర్ధించు

నిర్జి + ఇంచు = నిర్జించు

24. అలుక్సమాస సంధి :

సమాసమునందు చేత, తోడ, వలనల కిత్వంబగును.

ఉదా : నీచేతన్ + ప్రోపు = నీ చేతిప్రోపు
నీతోడన్ + చెలిమి = నాతోడిచెలిమి
నీవలనన్ + బయము = నీవలని భయము

25. తకారా దేశ సంధి :

చు వర్గముతోడ దుగ్దకారము తకారమగును.

ఉదా : నిలుచు + దురు = నిలుతురు
పిలుచు + దురు = పిలుతురు
వచించు + దురు = వచింతురు

## 4. సంస్కృత సంధులు

సంస్కృత పదముల మధ్య జరుగు సంధులను సంస్కృత సంధులందురు.

సంస్కృత సంధులు మూాడు విధములు

1. స్వర సంధులు
2. హల్సంధులు
3. విసర్గసంధులు

### 1. సర్వ సంధులు

1. సవర్ణదీర్ఘ సంధి :

అ-ఇ-ఉ-ఋలకు సవర్ణములు పరమైనపుడు దీర్ఘము ఏకాదేశముగా వచ్చును.

సమర్ణములనగా సమానమైన వర్ణములు 'అ'కు - అఆలు, ఇకి ఇ,ఈలు, ఉకు -ఉ ఊలు ఋ-ౠ ఋలు సవర్ణములు

ఉదా: రామ + ఆలయము = రామాలయము
కవి + ఇంద్రుడు = కవీంద్రుండు
భాను + ఉదయము = భానూదయము
పితృ + ఋణము = పితౄణము

**2. గుణ సంధి:**

అకారమునకు ఇ, ఉ, ఋలు పరమగునపుడు ఏ - ఓ - అర్‌లు ఆదేశముగా వచ్చును. ఏ - ఓ - అర్‌లను గుణములందురు. గుణములు అదేశముగా వచ్చు సంధి కావున ఇది గుణసంధి అయినది.

ఉదా: ఉప + ఇంద్రుడు = ఉపేంద్రుడు అ + ఇ = ఏ
హిత + ఉపదేశము = హితోపదేశము అ + ఉ = ఓ
సప్త + ఋషులు = సప్తర్షులు అ + ఋ = అర్

**3. వృద్ధిసంధి**

అకారమునకు ఏ, ఐ లు పరమైనచో ఐకారమును ఓ, ఔ లు పరమైనచో ఔకారమును ఆదేశమగును.

ఉదా: ఏక + ఏక = ఏకైక అ+ఏ=ఐ,
అష్ట + ఐశ్వర్యములు = అష్టైశ్వర్యములు అ+ఐ=ఐ,
దివ్య + ఓషధి = దివ్యౌషధి అ+ఓ=ఔ,
వన + ఔషధము = వనౌషధము అ+ఔ=ఔ

**4. యణాదేశసంధి:**

ఇ,ఉ,ఋ లకు అసమవర్ణములు పరమైనపుడు క్రమముగా య,వ,రలు ఆదేశముగా వచ్చును.

ఉదా: అతి + ఆశ = అత్యాశ, (అత్ + య్ + ఆశ),
మధు + అరి = మధ్వరి (మద్ + వ్ + అరి),
పితృ + ఆజ్ఞ = పిత్రాజ్ఞ (పిత్ + ర్ + అజ్ఞ)

## 2. హల్సంధులు

### 1. అనునాసిక సంధి :-

పరుషములకు నమలు పరమైనచో వాని వర్గాను నాసికములు ఆదేశముగా వచ్చును.

ఉదా : తత్ + నగరము = తన్ + నగరము = తన్నగరము

వాక్ + మయము = వాఙ + మయము = వాఙ్మయము

### 2. శ్చుత్వ సంధి :

'స' కార 'త' వర్గలకు 'శ'కార చ వర్గలు పరమైన చో శకార చవర్గము ఆదేశమగును.

ఉదా : మనన్ + శాంతి = మనశ్శాంతి

సత్ + జనులు = సజ్జనులు

సత్ + చిత్ = సచ్చిత్

### 3. జశ్త్వ సంధి :

పరుషములకు అచ్చులు కాని, సరళములు గాని యవరలు గాని పరమైనచో సరళము లాదేశమగును.

ఉదా : వాక్ + ఈశ = వాగీశ

అచ్ + అంతము = అజంతము

చిత్ + రూపము = చిద్రూపము

భగవత్ + భక్తి = భగవద్భక్తి

### 4. ఛత్వసంధి :

అనునాసికములకు తప్ప మిగిలిన వర్గాక్షరములకు పరమైన శకారము ఛ కారముగా మారును.

ఉదా : తత్ + శివ = శ్చుత్వ సంధి వచ్చి తచ్ + శివ = అగును.

ఛత్వ సంధి వచ్చి తచ్ + శివ = తచ్ఛివ అగును.

విద్యుత్ + శక్తి = విద్యుచ్ + శక్తి = విద్యుచ్ఛక్తి

5. ష్టుత్వసంధి:

సకార తకారములకు షకార టవర్గములు పరమై క్రమముగా షకార టవర్గంలు ఆదేశముగా వచ్చును.

ఉదా: రామః + టీకతే = రామష్టీకతే,

తత్ + టీకా = తట్టీకా

6. అనుస్వార సంధి:

పదాంతమందున్న 'మ'కారమునకు హల్లు : నచో అనుస్వారమగును.

ఉదా: హరిమ్ + వన్దే = హరింవన్దే.

7. పరసవర్ణసంధి:

పదాంతమునందున్న 'త'కారమునకు 'ల'కా పరమగునపుడు 'ల'కారమాదేశమగును.

ఉదా: విద్యుత్ + లత = విద్యుల్లత

తత్ + లయము = తల్లయము

8. తుగాగమ సంధి:

పదాంతమందున్న అచ్చునకు 'ఛ' పరమగునపుడు 'త్' ఆగమముగా వచ్చును.

ఉదా: వృక్ష + ఛాయ = వృక్ష + త్ + శ్చుత్వ సంధి జరిగి వృక్షచ్ఛాయ అగును.

.. పరరూపసంధి:

అకారమునకు అచ్చులు పరమగునపుడు ౕ పదములోని మొదటి అచ్చు ఏకాదేశమగును.

ఉదా: సార + అంగము = సారంగము

కుల + అట = కులట

## 3. విసర్గసంధులు

1. హ్రస్వ అకారముతో కూడిన విసర్గకు హ్రస్వ అకారము పరమైనచో 'ఓ' కారమాదేశమగును.

   ఉదా: రోదః + అంతరము = రోదోంతరము

   వయః + అధికుడు = వయోధికుడు

2. హ్రస్వఅకారముతో కూడిన విసర్గమునకు వర్గ ప్రథమ, ద్వితీయాక్షరములు శ,ష,సలు తప్ప మిగిలిన ఏహల్లు పరమైనను 'ఓ'కారమాదేశమగును.

   ఉదా: తపః + బలం = తపోబలం

   పురః + గతి = పురోగతి

   తపః + నిరతి = తపోనిరతి

   పయః + రుహము = పయోరుకము

3. విసర్గకు చ, ఛలు పరమైన 'శ'కారము, ట, ఠల పరమైన 'ష'కారము త,థ లు పరమైన 'స'కారముల దేశమగును.

   ఉదా: హరిః + చరతి = హరిశ్చరతి

   రామః + టీకతే = రామస్టీకతే

4. విసర్గకు శ,ష,సలు పరమైనచో 'స'కారము వికల్పముగా వచ్చును.

   ఉదా: హరిః + శేతే = హరిశ్శేత్, హరిఃశేతే

   చతుః + షష్టి = చతుష్షష్టి

5. విసర్గకు క,ఖ,లు ప,ఫలు పరముగానున్నచో అట్టి విసర్గకు మార్పు ఉండదు.

ఉదా: ప్రాతః + కాలము = ప్రాతఃకాలము

తపః + ఫలము = తపఃఫలము

# 6. ఆరవ ప్రకరణము
# సమాసములు

## 1. సమాసము :

వేరు వేరు అర్థములు గల పదములు ఏకపదమగుట సమాసము.

సాధారణముగా సమాసమున రెండు పదములుండును. మొదటి పదమును పూర్వపదమనియు, రెండవ పదమును ఉత్తర పదమనియు అందురు.

## 2. విగ్రహ వాక్యము :

సమాసము ఏర్పడుటకు ముందున్న విభక్తి ప్రత్యయములతో కూడిన పదములను విగ్రహవాక్యమందురు.

సమాసములు శబ్దమును బట్టి అర్థమును బట్టి ఏర్పడును శబ్దమును బట్టి సమాసము 3 విధములు

1. సాంస్కృతిక సమాసము
2. ఆచ్ఛిక సమాసము
3. మిశ్రమ సమాసము

## 3. సాంస్కృతిక సమాసము :

సాంస్కృతిక సమాసములు రెండు విధములు

1. సిద్ధము
2. సాధ్యము

1. సిద్ధము :

కేవలము సంస్కృత పదములతో కూడిన సమాసము సిద్ధ సమాసము

ఉదా : రాజాజ్ఞ, తటాకోదకము.

2. సాధ్యము :

కేవలము తత్సమ పదముల సమాసము సాధ్య సమాసము.

ఉదా : రాజునాజ్ఞ, తటాకంబునుదకము

## 4. ఆచ్ఛిక సమాసము :

అచ్ఛ తెలుగు పదములచే ఏర్పడు సమాసమును ఆచ్ఛిక సమాసమందురు.

ఉదా : చెరువు నీరు, రేనియానతి

## 5. మిశ్ర సమాసము :

తత్సమ పదములకు ఆచ్ఛిక పదములకు కలుగు సమాసము మిశ్ర సమాసము.

ఉదా : చెరువునుదకము, ఇందు చెరువు ఆచ్ఛిక పదము ఉదకము తత్స పదము అర్థమును బట్టి సమాసములు 6 విధములు.

1. తత్పురుషము
2. కర్మధారయము
3. ద్విగువు
4. ద్వంద్వము
5. బహువ్రీహి
6. అవ్యయిభావము

## 6. తత్పురుష సమాసము

ఉత్తర పదము ప్రధానముగా గల సమాసమును తత్పురుష సమాసమందురు.

ఈ సమాసములు 7 విధములు

### 1. ద్వితీయా తత్పురుషసమాసము

మొదటి పదము చివర ద్వితీయా విభక్తి ఉన్న యెడల అది ద్వితీయా తత్పురుషము.

| సమాసము | | విగ్రహవాక్యము |
|---|---|---|
| ఉదా : నెలతాల్పు | - | నెలను తాల్చినవాడు |
| జలధరము | - | జలమును ధరించునది. |

### 2. తృతీయా తత్పురుష సమాసము

మొదటి పదము చివర తృతీయా విభక్తి ఉన్న తత్పురషము

| | | |
|---|---|---|
| ఉదా : రాజపూజితుడు | - | రాజుచేత పూజితుడు |
| నెలతక్కువవాడు | - | నెలచేత తక్కువవాడు |

### 3. చతుర్థీతత్పురుష సమాసము

మొదటి పదమము చివర చతుర్థీ విభక్తి ఉన్న తత్పురుషము

| | | |
|---|---|---|
| ఉదా : ధనాశ | - | ధనము కొరకు ఆశ |
| భూతబలి | - | భూతముల కొరకు బలి |

### 4. పంచమీ తత్పురుష సమాసము

మొదటి పదము చివర పంచమీ విభక్తి ఉన్న తత్పురుషము

| | | |
|---|---|---|
| ఉదా : దొంగభయము | - | దొంగ వలన భయము |
| స్వర్గపతితుడు | - | స్వర్గము నుండి పతితుడు |

5. షష్ఠీ తత్పురష సమాసము

మొదటి పదము చివర షష్ఠీ విభక్తి ఉన్న సమాసము షష్ఠీ తత్పురుష సమాసము

ఉదా: రాముని బాణము - రాముని యొక్క బాణము
భుజ బలము - భుజము యొక్క బలము

6. సప్తమీ తత్పురుషము

మొదటి పదము చివర సప్తమీ విభక్తి ఉన్న సమాసము సప్తమీ తత్పురుష సమాసము

ఉదా: మాటనేర్పరి - మాటయందునేర్పరి
పురజనులు - పురము నందలి జనులు

7. నఞ తత్పురుషము

నఞ అనునది వ్యతిరేకార్థమును తెలుపును నఞకు అచ్చు పరమైన ' అన్ ' అనియు, హల్లు పరమైన ' అ ' అనియు ఆదేశమగును. పూర్వపదములుగా ' అన్, అ, 'లు ఉన్న సమాసమును నఞ తత్పురుష సమానమందురు.

ఉదా: అనుచితము - నఞ + ఉచితము - ఉచితము కానిది
అజ్ఞానము - నఞ + జ్ఞానము - జ్ఞానము కానిది

7. కర్మధారయము:

విశేషణ విశేష్యములకు చేయబడిన సమాసమును కర్మధారయ సమాసమందురు. ఇందు ఉత్తర పదము ప్రధానము. ఈ సమాసము యొక్క విగ్రహవాక్యములోని పదములన్నియు ' ప్రథమా విభక్తి'లో ఉండును.

విశేషణము ఉనికిని బట్టి స్వరూపమును బట్టి 7 విధములు.

1. విశేషణ పూర్వపద కర్మధారయము
2. విశేషణోత్తర పద కర్మధారయము
3. విశేషణోభయ పద కర్మధారయము
4. ఉపమాన పూర్వపద కర్మధారయము
5. ఉపమానోత్తర పద కర్మధారయము
6. అవధారణ పూర్వపద కర్మధారయము (రూపక సమాసము)
7. సంభావనా పూర్వ పద కర్మధారయము

1. విశేషణ పూర్వపద కర్మధారయము:

విశేషణము మొదటి పదముగాను విశేష్యము రెండవ పదముగాను ఉన్న సమాసమును విశేషణ పూర్వపద కర్మధారయ సమాసమందురు.

ఉదా: నల్లకలువ - నల్లనైన కలువ

ఇందునల్ల విశేషణము, కలువ విశేష్యము

2. విశేషణోత్తర పద కర్మధారయము:

విశేషణము ఉత్తార పదముగా గల సమాసము.

ఉదా: కపోతవృద్ధము - వృద్ధమైన కపోతము

3. విశేషణోభయ పద కర్మధారయము

రెండు పదములు విశేషణములు గల సమాసము.

ఉదా: శీతోష్ణము - శీతము, ఉష్ణము

4. ఉపమాన పూర్వపద కర్మధారయము:

ఉపమానము పూర్వపదముగా నున్న సమాసము.

ఉదా: తేనెమాట - తేనె వంటి మాట

5. ఉపమానోత్తర పద కర్మధారయము:

ఉపమానము ఉత్తర పదముగా నున్న సమాసము

ఉదా: ముఖ పద్మము – పద్మము వంటి ముఖము

6. అవధారణ పూర్వ పద కర్మధారయము - (రూపక సమాసము)

ఉపమేయము పూర్వపదముగాను, ఉపమానము ఉత్తర పదముగాను ఉండి, వాటి మధ్య భేదము లేదు అని చెప్పిన సమాసమును అవధారణ పూర్వపద కర్మధారయ సమాసము లేక రూపక సమాసమందురు.

విగ్రహవాక్యములో అను, అనెడి వంటి రూపక పదములు చేరును.

ఉదా: కవి సింహము - కవి అనెడి సింహము

ఇందు కవి ఉపమేయము, సింహము ఉపమానము రెండో పదముల మధ్య భేదము లేదని చెప్పబడినది.

7. సంభావనా పూర్వపద కర్మధారయము :

సంభావనా పదము పూర్వమందు గల సమాసమః సంభావనా పూర్వపద కర్మధారయ సమాసమందురు.

ఉదా: నర్మదానది - నర్మదయనునది.

చింత చెట్టు - చింతయను పేరు గల చెట్టు.

సంభావన అనగా సంజ్ఞ (పేరు)

8. ద్విగు సమాసము :

మొదటి పదము సంఖ్యా విశేషణముగా నున్న కర్మధారయ సమాసమును ద్విగుసమాసమందురు.

ఉదా: ముల్లోకములు - మూడైనలోకములు

9. ద్వంద్వ సమాసము :

ఉభయ పదార్థ (రెండు పదములు) ప్రధానమైనది ద్వంద్వ సమాసము.

ఉదా: సీతారాములు - సీతయును, రాముడును.

ఇందు రెండు పదములును ఒకే విధమైన ప్రాధాన్యము కలిగి యుండును.

సమాసములోని పదములన్నియు ప్రధానముగా గలది బహుపద ద్వంద్వ సమాసము.

ఉదా: ధర్మార్థ కామమోక్షములు, - ధర్మమును, అర్థమును, కామమును, మోక్షమును.

ఇందు రెండు పదముల కంటే ఎక్కువ పదములుండుటచే బహు పద ద్వంద్వమైనది.

## 0. బహువ్రీహి సమాసము :

అన్యపదార్థ (ఇతర పదము) ప్రధానమైనది బహువ్రీహి సమాసము.

ఇందు విగ్రహ వాక్యములో 'కలది', 'కలవాడు' అను పదములు వచ్చును.

ఉదా: ముక్కంటి - మూడు కన్నులు కలవాడు

దశకంఠుడు - పది కంఠములు కలవాడు.

ఇందు శివుడు, రావణుడు అను సమాసములో లేని ఇతర పదములకు ప్రాధాన్యము కలిగినది కావున ఇది బహువ్రీహి సమాసమైనది.

### నఞ బహువ్రీహి సమాసము :

సమాసము నందలి పదములు తమ అర్థమును కోల్పోయి వ్యతిరేకార్థము నిచ్చిన నఞ బహువ్రీహి సమాసమగును.

ఉదా: అప్రతిముడు - ప్రతిముడు కానివాడు.

అచ్యుతుడు - చ్యుతి (నాశము) లేనివాడు.

## 11. అవ్యయీభావ సమాసము :

అవ్యయమునకు ఇతర పదములకు జరుగు సమాసమును అవ్యయీభావ సమాసమందురు. ఇందు పూర్వ పదము ప్రధనమైనది. మొదటి పదము అవ్యయముందును.

ఉదా: ప్రతి దినము - దినము, దినము
ప్రతి - అవ్యయము
యధాశక్తి - శక్తిని అతిక్రమించకుండ
యధా - అవ్యయము

అవ్యయిభావ సమాసములన్నియు సాంస్కృతిక సమాసములు.

# 7. ఏడవ ప్రకరణము
# అలంకారములు

శరీరమునకు వివిధ రకములైన అలంకారములు ఏవిధముగా అందమును కలుగజేయునో అదేవిధముగా అలంకారములు భాషకు అందమును కలుగజేయును ఇవి చమత్కారముగా నుండి మనసుకు ఉల్లాసమును కలిగించును. ఈ అలంకారములు కవి యొక్క ప్రతిభను తెలియ జేయును.

అలంకారములు రెండు విధములు
1. శబ్దాలంకారములు
2. అర్థాలంకారములు

## 1. శబ్దాలంకారములు

శబ్దాలంకారములు ముఖ్యముగా మూడురకములు
1. అనుప్రాసము

2. యమకము

3. ముక్తపదగ్రస్తము

1. అనుప్రాసము : అనుప్రాసము నాలుగు విధములు.

a. వృత్త్యనుప్రాసము

b. ఛేకాను ప్రాసము

c. లాటాను ప్రాసము

d. అంత్యాను ప్రాసము

**a. వృత్త్యను ప్రాసము :**

ఒకే అక్షరము పలు మార్లు వచ్చిన వృత్త్యను ప్రాసాలంకారమగును.

ఉదా : అక్షణమున పక్షివాహనుడు సాక్షాత్కరించి విపక్షు
అగు రాక్షసులను శిక్షించెను.

ఇందు ' క్ష ' అను అక్షరము పలు మార్లు వచ్చుటకు ఇది కృత్యను ప్రాసాలంకారమైనది.

**b. ఛేకాను ప్రాసము :**

రెండు రెండక్షరములు వ్యవధనము లేకుండ ప్రయోగింపబడిన ఛేకాను ప్రాసాలంకార మగును.

ఉదా : ఏల పోయెదవు నిలు నిలు మనుచు

ఇందు నిలు నిలు అను రెండక్షరములు వ్యవధానము లేకుండ ప్రయోగింపబడినవి కావున ఇది ఛేకాను ప్రాసాలంకారము.

**c. లాటాను ప్రాసము :**

తాత్పర్యభేదము గల ఒక పదము రెండుమార్లు ప్రయోగింపబడిన లాటాను ప్రాసము.

ఉదా : కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ

ఇందు ' కరములు ' అనగా చేతులు అవి అర్థము ఈ శబ్దము రెండు మార్లు ప్రయోగింపబడినది. అర్థములో భేదము లేదు. కాని తాత్పర్యభేద మున్నది మొదటి కకారమునకు సామాన్యమైన చేయి అనియు, రెండవ కరమునకు శ్రేష్ఠమైన కరమనియు తాత్పర్య భేదముండు టచే లాటాను ప్రాసమైనది. అట్లే జిహ్వ అను పదమునకు అర్థములో భేదములేదు కాని తాత్పర్య భేదమున్నది.

d. అంత్యానుప్రాసలంకారము :

పదములయొక్క, వాక్యముల యొక్క, పద్యపాదము లయొక్క చివరయందు పదములు పునరుక్తమైన అంత్యాను ప్రాసలంకారమగును.

ఉదా : రఘు **రామ** ! సకలగుణశోభిత **రామ**

ఇందు' రామ ' అను పదము రెండు పదముల చివర పునరుక్తమైనది.

ప్రభాత సమయమున మేల్కాంచెను.
దేవుని పూజించెను.

ఇందు ' చెను ' అను వర్ణములు వాక్యాంతమున పునరుక్తమైనవి.

**ఉన్నాఁడు** లెస్సరాఘవు
**డున్నాఁడు** కవులగూడియు రుగతిరానై
**యున్నాఁడు** నిన్ను గొనిపో
**నున్నాఁ**డిది నిజమునమ్ము మూర్వీతనయా !

ఈ పద్యములో ప్రతి వాక్యముచివర 'ఉన్నాఁడు' అను పదము ఆవృతమైనది కావున ఇది అంత్యానుప్రాసము.

2. యమకాలంకారము :

అర్థ భేదముగల అక్షరములను మరల మరల ప్రయోగించిన యమకాలంకారమగును.

ఉదా: లేమా దనుజులగెలువగ
లేమానీకాలకడికి లేచితిలిటురా

ఇందు లేమా అను పదములు అర్థభేదము గలిగి వెంటవెంటనే ప్రయోగింపబడినవి కావున ఇది యమకాలంకారమగును.

3. ముక్తపదగ్రస్తము :

పాదాంతమున గాని వాక్యాంతమున గాని విడిచిన పదమున అవ్యవధానముగా మరలమరల ప్రయోగించిన ముక్తపదగ్రస్తమగును.

ఉదా: సుదతీ నూతన మదనా
మదనాగ తురంగ పూర్ణ మణి మయసదనా

ఇందు మదనా, అను పదములు ఒకపాదాంతమున విడిచి పెట్టబడి మరల గ్రహింపబడినది.

2. అర్థాంలంకారములు :

శబ్దముతో నిమిత్తము లేకుండా కేవలము అర్థము ప్రధానముగా నుండు అలంకారములను అర్థాలంకారములందురు. అర్థాలంకారములు అనేక విధములుగా ఉన్నవి.

అందులో ముఖ్యమైన వాటి గురించి వివరించబడును. కొన్ని ముఖ్యమైన అర్థాలంకారములు.

1. ఉపమాలంకారము
2. రూపకాలంకారము
3. ఉత్ప్రేక్షలంకారము

4. అనన్వయాలంకారము
5. అతిశయోక్తి
6. శ్లేషాలంకారము
7. భ్రాంతిమంతాలంకారము
8. వ్యతిరేకాలంకారము
9. విరోధాభాసాలంకారము
10. దృష్టాంతాలంకారము
11. వ్యాజస్తుత్యలంకారము
12. వ్యాజనిందాలంకారము
13. సమాసోక్త్యలంకారము
14. అప్రస్తుత ప్రశంసాలంకారము
15. కావ్యలింగాలంకారము
16. అర్థాంతరన్యాసాలంకారము
17. స్వభావోక్తి
18. దీపకాలంకారము
19. ఉల్లేఖాలంకారము
20. క్రమాలంకారము

**1. ఉపమాలంకారము :**

ఉపమానమునకు ఉపమేయమునకు సాదృశ్యమును చెప్పిన ఉపమాలంకారమగును.

ఇందు ఉపమానము, ఉపమేయము, ఉపమావాచకము, సమానధర్మము అను నాలుగు భాగములుండును.

ఉపమానము - పోలిక చెప్పిన వస్తువు
ఉపమేయము - వర్ణింపబడు వస్తువు

ఉదా : ఆమె ముఖము చంద్రబింబమువలె అందముగా నున్నది.

ఇందు ముఖము - ఉపమేయము

చంద్రబింబము - ఉపమానము

వలె - ఉపమావాచకము

అందముగా నున్నది - సమాన ధర్మము

ఇందు ముఖమునకు చంద్ర బింబమునకు పోలిక చెప్పబడినది కావున ఇది ఉపమాలంకారమైనది. పైవాక్యము పూర్ణోపమాలంకారమునకు ఉదాహరణము.

**లుప్తోపమాలంకారము :**

ఉపమేయ, ఉపమాన, ఉపమావాచక సమానధర్మ ములలో ఏది లోపించినా అది లుప్తోపమ అగును.

ఉదా : ఆమె ముఖము చంద్రబింబము వలెఉన్నది.

ఇందు ముఖము - ఉపమేయము

చంద్రబింబము - ఉపమానము

వలె - ఉపమావాచకము

సమానధర్మము లోపించినది కావున ఇది లుప్తోపమ.

**2. రూపకాలంకారము :**

ఉపమానమునకు ఉపమేయమునకు భేదము లేదని చెప్పిన రూపకాలంకారమగును.

ఉదా : ఆమె ముఖ చంద్రునిచే ఆనందము కలుగుచున్నది.

ఇందు ముఖము - ఉపమేయము

చంద్రుడు - ఉపమానము

ముఖచంద్రుడు అనగా ముఖమనెడి చంద్రుడు ముఖమునకు చంద్రునకు భేదము లేదని చెప్పబడుటచే ఇది రూపకాలంకారమైనది.

**3. ఉత్ప్రేక్షలంకారము :**

ఉపమానము యొక్క ధర్మము ఉపమేయము నందుండుటచే ఉపమేయమును ఉపమానముగా నూహించుటను ఉత్ప్రేక్షలంకారమందురు.

ఉదా : ఆ చీకటిని చక్రవాకాంగన యొక్క విరహాగ్ని ధూమమని తలంతును.

ఇందు చీకటి - ఉపమేయము
ధూమము (పొగ) - ఉపమానము

చీకటికి పొగకు ఉన్న సమానధర్మములు నల్లగా నుండుట, కన్నులు కనపడకపోవుట. ఈ లక్షణము చేత ఉపమేయమును (చీకటి) ఉపమానముగా (ధూమము) నూహించుట జరిగినది. కావున ఇది ఉత్ప్రేక్షలంకారము.

**4. అతిశయోక్తి:**

ఒక వస్తువు యొక్క స్థితిని ఉన్నదాని కంటె అతిశయించి చెప్పుటను అతిశయోక్త్యలంకారమందురు.

ఉదా : ఆనగర సౌధాగ్రములు చంద్రమండలము నంటుచున్నవి.

ఇందు నిజముగా సౌధాగ్రములు చంద్రమండలమునంట కున్నను అంటు చున్నవని చెప్పుటచే అతిశయోక్తి అయినది.

**5. అనన్వయాలంకారము :**

ఒక వస్తువునకు మరల అదే వస్తువు ఉపమానముగా చెప్పినచో నది అనన్వయాలంకారమగును.

ఉదా : పరాక్రమమునందు రామునకు రాముడేసాటి.

ఇందు ఉపమేయము ఉపమానము రెండును రాముడే అనగా రామునికి సాటి వేరొకడు లేడని అర్థము.

6. శ్లేషాలంకారాము :

అనేకార్థములుగల శబ్దములనుపయోగించి వేరు వేరు భావములను కల్గించుటను శ్లేషాలంకారమందురు.

ఉదా: రాజు కువలయానందకరుడు

రాజు - చంద్రుడు, భూపతి

కువలయము - కలువ, భూమి.

ఆనందకరుడు - ఆనందమును కలిగించువాడు.

ఈ విధముగా రెండర్థములు గల పదములనుపయోగించి ఒకే వాక్యములో రెండు భావములు కల్గించుటచే శ్లేషాలంకారమైనది.

భ్రాంతిమంతాలంకారము :

ఒక వస్తువును భ్రాంతిచేత వేరొక వస్తువుగా తలచిన భ్రాంతిమంతాలంకారమగును.

ఉదా: ఆమె ముఖము పద్మమని భ్రాంతి చెంది తుమ్మెదలు వ్రాలుచున్నవి.

ఇందు తుమ్మెదలకు ముఖమునందు పద్మభ్రాంతి కలిగినది కావున ఇది భ్రాంతిమంతాలంకారము.

:. వ్యతిరేకాలంకారము :

ఉపమేయ, ఉపమానములలో ఒక దానికి ఆధిక్యము చెప్పినచో వ్యతిరేకాలంకారమగును.

ఉదా: ఆర్యులు పర్వతములవలె ఉన్నతులైనను వారి స్వభావము కోమలము.

ఇందు ఆర్యులు - ఉపమేయము

పర్వతములు - ఉపమానము

ఉపమానమైన పర్వతమునందు కాఠిన్యమను గుణమున్నది. కాని ఆర్యులందు దానికి విరుద్ధముగా

కోమలత్వము అనుగుణము అధికముగా నున్నది. ఉపమేయము ఉపమానము కంటె ఆధిక్యము కలిగియున్నది కావున ఇది వ్యతిరేకాలంకారము.

9. విరోధాభాసాలంకారము :

విరోధమునకు ఆభాసత్వమున్న యెడల విరోధాభాసాలంకారమగును.

ఉదా : రాజు వక్షము హారము లేకున్నను హారియై ఉన్నది.

హారములేకున్నను హారియై ఉన్నదనుట విరోధము

హారి అనగా - హారము కలది - మనోహరమైనది అని రెండర్థములున్నవి. మొదటి అర్థము తీసికొనిన విరోధము కనిపించును కాని రెండవ అర్థములో రాజు వక్షమున హారము లేకపోయినను మనోహరముగా ఉన్నదనుట విరోధాభాసము.

0. దృష్టాంతాలంకారము :

ఉపమానోపమేయములందున్న భిన్న ధర్మములను బింబ ప్రతిభావముతో చెప్పినచో దృష్టాంతాలంకారమగును.

ఉదా : ఓ రాజా! నీవే కీర్తి మంతుడవు

చంద్రుడేకాంతి మంతుడు

ఇందు రాజు ఉపమేయము, చంద్రుడు ఉపమానము రాజు యొక్క ధర్మము కీర్తి

చంద్రుని యొక్క ధర్మముకాంతి.

ఇవి రెండును భిన్న ధర్మములు, దిగంతములవరకు వ్యాపించుట వీని సమాన ధర్మము. ఈ రెండు భిన్న ధర్మములు బింబప్రతిబింబ భావముతో రెండు వాక్యములలో చెప్పబడినవి కావున ఇది దృష్టాంతాలంకారమైనది.

**11. వ్యాజస్తుత్యలంకారము :**

నిందారూపమునస్తుతిని, స్తుతి రూపమున నిందను చెప్పిన వ్యాజస్తుత్యలంకారమగును.

1. ఓ గంగా! నీవు పాపులను సైతము పవిత్రులను చేయుచున్నావు. నీకు వివేక మెక్కడికి.

ఇది నిందా రూపమున ఉన్న స్తుతి. పైకి నిందగా కనబడచున్నది. కాని పాపులను సైతము పవిత్రులను చేయుట అను కార్యమును బట్టి గంగా నదిని ప్రశంసించుట జరిగినది.

2. ఓ దూతికా! నాకొరకెంత కష్టపడితివి. నఖక్షతము లును దంతక్షతములును కల్గించుకొంటివి.

ఇది స్తుతి రూపమున ఉన్న నింద. పైకి స్తుతిగా కనబడుచున్నది. కాని తన దూతికను ప్రియుని వద్దకు రాయబారమునకు పంపగా ఆప్రియుని వలపును పొంది తిరిగి వచ్చిన దూతికతో నాయిక ఈ మాటలు పల్కుచున్నది. నీవు వంచకురాలివి. నా కొరకు దూతికగా వెళ్ళి నాయకునితో సుఖమును పొంది నన్ను మోసము చేసితి వనెడి నింద ఈ వాక్యములో ఉన్నది.

**12. వ్యాజనిందాలంకారము :**

నింద వలన నింద స్ఫురించిన వ్యాజనిందాలంకార మగును.

ఉదా : '' ఒక తల నరికిన శివునన వలెను గాని బ్రహ్మనని ప్రయోజనమేమి ''

ఇచట శివుని నిందించుట జరిగినది. కాని శివునితో పాటు బ్రహ్మనింద కూడ స్ఫురించుచున్నది కావున ఇది వ్యాజనిందాలంకారము.

**13. సమాసోక్త్యలంకారము :**

ప్రస్తుతము వర్ణించిన అప్రస్తుతము స్ఫురించినచో అది సమాసోక్తి అగును.

ఉదా : చంద్రుడనురుక్తుడై ఐంద్రీ ముఖమును (తూర్పు దిక్కు) చుంబించుచున్నాడు.

చంద్రుడు ఎర్రదనమును పొంది తూర్పుదిక్కును తాకు చున్నాడని అర్థము.

అనురక్తుడు అను పదమునకు అనురాగముర కలవాడు అని అర్థము. ఐంద్రీ అను స్త్రీలింగముపయోగించుట వలన 'నాయిక ముఖము'అను అర్థము ధ్వనించుచున్నాడు. 'చుంబించుచున్నాడు' అని చెప్పుట చేత ముద్దుపెట్టుకొను చున్నాడు అని అర్థము కల్గుచున్నది.

చంద్రవర్గనము ప్రస్తుతమైనను పదముల అర్థబు వలన ఒకనాయకుడు నాయికను ముద్దుపెట్టు కొనుచున్నాడను అప్రస్తుతము స్ఫురించుచున్నది. కావున ఇది సమాసోక్తి.

**14. అప్రస్తుతప్రశంసాలంకారము :**

ప్రస్తుత విషయము స్ఫురించునట్లుగా అప్రస్తుత విషయమును చెప్పిన అప్రస్తుతప్రశంసాలంకారమగును.

ఉదా : ఇంద్రుని తప్ప ఇతరులను యాచింపని చాతకపక్షి ఒక్కటే పక్షులలో ధన్యమైనది.

ఇందు వర్షము కొరకు చాతక పక్షి ఇంద్రుని యాచించును. అనునది అప్రస్తుత విషయము. దీని వలన గుణవంతుడైన సమర్థుని యాచించిన వాడు 'ధన్యుడు

అను ప్రస్తుత విషయము స్ఫురించుచున్నది కావున ఇది అప్రస్తుతప్రశంసాలంకారమైనది.

15. కావ్యలింగాలంకారము :

సమర్థింపవలసిన అర్థమునకు హేతువు నిరూపించబడినచో కావ్యలింగాలంకారమగును.

ఉదా : మన్మధుడు నాచే జయింపబడెను
నామనసులో శివుడున్నాడు

మన్మధుని ఓడించుట అనునది కష్ట సాధ్యమైన పని. కావున ఎట్లు జయించితివి అను ప్రశ్నవచ్చును నీ మనసులో శివుడున్నాడు కనుక జయించితిని అని సమర్థింపబడినది కావున ఇది కావ్యలింగాలంకారమైనది. (శివుడు తన మూడవ కంటితో మన్మధుని దహించెను.)

16. అర్థాంతరన్యాసము :

సామాన్యమును విశేషముచేతగాని, విశేషమును సామాన్యముచేతగాని సమర్థించిన అర్థాంతరన్యాసాలంకారమగును.

ఉదా : హనుమంతుడు సముద్రమును దాటెను
మహాత్మకు దుష్కరమైనది లేదుకదా!

ఇందు హనుమంతుడు సముద్రమును దాటెను అనునది విశేష విషయము. దానిని "మహాత్ములకు దుష్కరమైనది లేదు - అను సామాన్య విషయము చేసమర్థింపబడినది.

ఉదా : మహాత్ముల సంపర్కముచే అల్పులకు కూడ గౌరవము కలుగుచున్నది. పూలమాలతో కూడిన దారము కూడ తలయందు ధరింపబడుచున్నది.

ఇందు మొదటి అంశము సామాన్య విషయము. రెండవ అంశము విశేషవిషయము. ఇందు సామాన్య విషయము విశేషముచే సమర్థింపబడినది.

17. స్వభావోక్తి:

జాతి గుణక్రియాదులను ఉన్నవి ఉన్నట్లుగా వర్ణించుటను స్వభావోక్తి అందురు.

ఉదా : ఉద్యాన వనమున లేళ్ళు లెక్కించిన చెవులతో, బెదురు చూపులతో, సగము కొరికిన దర్భలు నోటినుండి వ్రేలాడుచుండుగా తలలు వెనుకకు త్రిప్పి నిలిచియున్నవి.

ఇందు ఉద్యానవనములోని లేళ్ళ స్థితిని స్వాభావికముగా వర్ణించుటచేనిది స్వభావోక్తి అయినది.

18. దీపకాలంకారము :

ప్రకృతా ప్రకృతములకు ధర్మైక్యము క్రియతో అన్వయించిన దీపకాలంకారమగును.

ఉదా : ఏనుగు మదముచేతను, రాజు ప్రతాపము చేతను ప్రకాశించును.

ఇందు రాజు ప్రకృతము, ఏనుగు అప్రకృతము ప్రకాశించుట ధర్మము. ఈ ప్రకాశించును అను క్రియరాజుకు ఏనుగుకు కూడ అన్వయింపబడినది కావున దీపకాలంకారము.

19. ఉల్లేఖాలంకారము :

ఒకే వస్తువును ఒక్కడే అనేక విధములుగా చెప్పిన లేక అనేకులు అనేక విధములుగా చెప్పిన ఉల్లేఖాలంకారమగును.

ఉదా : 1. అతడు వాక్కులందు బృహస్పతి, కీర్తియందర్జు
నుడు చాపమున భీష్ముడు.

2. అతనిని స్త్రీలు మన్మధుని గాను, యాచకులు కల్పతరువుగాను శత్రువులు యమునిగాను తలంతురు.

మొదటి ఉదాహరణమందు ఒకేవ్యక్తిని . ఒకేవ్యక్తి అనేక విధములుగా చెప్పుట జరిగినది. రెండవ దానియందు అనేకులు అనేక విధములుగా చెప్పుట జరిగినది కావున ఉల్లేఖము.

**20. క్రమాలంకారము :**

ఒక క్రమములో నున్న పదములకు అదే క్రమములో అన్వయము కలిగించుటను క్రమాలంకారమం దురు.

ఉదా : ధనము విద్యను లక్ష్మి సరస్వతులిచ్చెదరు

ఇందు ధనమును లక్ష్మిదేవి, విద్యను సరస్వతి ఇచ్చెదరని క్రమములో అన్వయము చెప్పబడినది కావున క్రమాలంకారమైనది.

# 8. ఎనిమిదవ ప్రకరణము
## ఛందస్సు

పద్యముల యొక్క స్వరూప, స్వభావములను తెలియజేయునది ఛందస్సు. ఈ ఛందస్సు పద్య రచనకు తోడ్పడును.

ఇందు ముఖ్యముగా గురు, లఘు, గణ, యతి, ప్రాసల గురించి వివరణ ఉండును.

అక్షరము గురువులని లఘువులని రెండు విధములు ఏక మాత్రాకాలములో ఉచ్చరింప బడునవి లఘువులు. ద్విమాత్రాకాలములో ఉచ్ఛరింపబడునవి గురువులు.

**1. లఘువులు** – లఘువులకు గుర్తు 'I'

1. హ్రాస్వాక్షరములన్నియు లఘువులు
   ఉదా :- అ, ఇ, ఉ, ఋ, ఎ, మొ.వి.
2. భిన్న పదములందలి సంయుక్తాక్షరములకు ముందున్న హ్రస్వములు లఘువులు.
   **ఉదా :** అతడు క్రమంబు తెలిసె
   ఇందు ' డు ' లఘువు
3. అద్రుచు, విద్రుచు, ఎద్రుచు మున్నగు పదములందలి సంయుక్తాక్షరమైన ద్రుకు ముందున్న హ్రస్వములు లఘువులు.
4. హ్రస్వములైన ద్విత్వాక్షరములు సంయుక్తాక్షరములు లఘువులు.
   **ఉదా :** రక్తము - ఇందు ' క్త' లఘువు
5. గురువులుకాని అక్షరములన్నియు లఘువులు

**2. గురువులు** – గురువుకు గుర్తు **'U'**

1. దీర్ఘాక్షరములు గురువులు
   **ఉదా :** ఆ, ఈ, ఊ, ౠ , ఏ, ఐ, ఓ, ఔ మొ.వి.
2. పూర్ణాను స్వారమునకు ముందున్న అక్షరములు గురువులు
   **ఉదా :** కం, రం, టం, తం.
3. విసర్గకు ముందున్న అక్షరములు గురువులు
   **ఉదా :** దుఃఖము, అంతఃపురము

4. నకార పొల్లునకు ముందున్న అక్షరములు గురువులు.
ఉదా: రామున్ అచటన్ తినుచున్

5. సంయుక్తాక్షరములకు ముందున్న అక్షరములు గురువులు.
ఉదా: పద్మము, కర్మ, చక్రము

6. ద్విత్వాక్షరములకు ముందున్న అక్షరములు గురువులు.
ఉదా: పద్దెము విత్తము

**3. గణములు :-**

సామాన్యముగా గణము అనగా గుంపు అని అర్థము అక్షరముల గుంపును కూడ గణమని వ్యవహరింతురు.

రెండక్షరములు గల గణములు నాలుగు

| గణము | గుర్తు | ఉదాహరణము |
|---|---|---|
| లల (లఘువు లఘువు) | II | హరి |
| లగ (లఘువు, గురువు) | IU | రమా |
| గగ (గురువు, గురువు) | UU | రామా |
| గల గురువు, లఘువు | UI | రామ |

మూడక్షరములున్న గణములు — **8.**

| గణము | గుర్తు | ఉదాహరణము | వివరణ |
|---|---|---|---|
| 'మ' గణము | UUU | శ్రీరామా | మూడు గురువులు |
| 'భ' గణము | UII | రాఘవ | ఆది గురువు |

| | | | |
|---|---|---|---|
| 'జ' గణము | UIU | ముకుంద | మధ్య గురువు |
| 'స' గణము | IIU | వరదా | అంత్య గురువు |
| 'న' గణము | III | రమణ | మూడు లఘువులు |
| 'య' గణము | IUU | మురారీ | ఆది లఘువు |
| 'ర' గణము | UIU | కేశవా | మధ్య లఘువు |
| 'త' గణము | UUI | శ్రీరామ | అంత్య లఘువు |

ఈ క్రింది పద్ధతిలో సులభముగా గుర్తుంచు కొనవచ్చును.

1 2 3 4 5 6 7 8

''య మా తా రా జ భా న స ల గం'' - దీనిలో ఎనిమిది గణములున్నవి.

| | | | |
|---|---|---|---|
| ఉదా: | 'య' గణము | యమాతా<br>IUU | మొదటి గురువు |
| | 'మ' గణము | మాతారా<br>UUU | మూడు గురువులు |
| | 'త' గణము | తారాజ<br>UUI | చివరి లఘువు |
| | 'ర' గణము | రాజభా<br>UIU | మధ్య లఘువు |
| | 'జ' గణము | జభావా<br>IUI | మధ్య గురువు |
| | 'భ' గణము | భానస<br>UII | ఆది గురువు |
| | 'న' గణము | నసల<br>III | మూడు లఘువులు |
| | 'స' గణము | సలగం<br>IIU | అంత్య లఘువు |

వీనిని భ, జ, స, య, ర, త, మ, న అని గుర్తుంచుకొన వచ్చును.

| | | |
|---|---|---|
| భ | UII | ఆది గురువు |
| జ | IUI | మధ్య గురువు |
| స | IIU | అంత్య గురువు |
| య | IUU | ఆది లఘువు |
| ర | UIU | మధ్య లఘువు |
| త | UUI | అంత్య లఘువు |
| మ | UUU | మూడు గురువులు |
| న | III | మూడు లఘువులు |

సూర్య గణములు - రెండు - 2

| | | | |
|---|---|---|---|
| 1. గలము (హగణము) | UI | గురువు లఘువు | వాణి |
| 2. నగణము | III | మూడు లఘువులు | రమణ |

ఇంద్ర గణములు - ఆరు - 6

| గణము | గుర్తు | ఉదాహరణము | వివరణము |
|---|---|---|---|
| నలము | IIII | అహిపతి | నగణము+ లఘ |
| నగము | IIIU | ఖగపతీ | నగణము+ గు |
| సలము | IIUI | జలజాక్షి | సగణము+ లఘ |
| భ-గణము | UII | రాఘవ | భగణము |
| ర-గణము | UIU | శ్రీహరీ | రగణము |
| త-గణము | UUI | మాయాలి | తగణము |

## చంద్ర గణములు - పదునాలుగు - 14.

| | గణము | గుర్తు | ఉదాహరణము |
|---|---|---|---|
| 1. | నగగ | IIIUU | కమలనాథా |
| 2. | నహ | IIIUI | కరుణరూప |
| 3. | సలల | IIUII | అసురాంతక |
| 4. | భల | UIIU | అంబుధర |
| 5. | భ గురువు | UIIU | భద్రముఖా |
| 6. | మ లఘువు | UUUI | అంభోజాక్ష |
| 7. | సవ | IIUIU | భువనేశ్వరా |
| 8. | సహ | IIUUI | పర విద్వేషి |
| 9. | తల | UUII | రక్తాంబర |
| 10. | రల | UIUI | పంకజాక్షి |
| 11. | నవ | IIIIU | గజగమనా |
| 12. | నలల | IIIII | అహిశయన |
| 13. | రగురు | UIUU | రామరాజా |
| 14. | తగ | UUIU | సీతాపతీ |

పద్యము :-

పాద నియమము కలిగి యతి ప్రాసలతో కూడిన పదసముదాయమును పద్యమందురు.

గద్యము :

పాద నియమములేక అర్థవంతములైన పదముల సముదాయమును గద్యమందురు.

### 4. యతి :

ప్రతి పాదముయొక్క మొదటి అక్షరమును యతి అందురు.

ద్వితీయాక్షరమును ప్రాస అందురు.

సంస్కృతమున యతి అనగా విరామము. అనగా కొన్ని పదముల పిమ్మట విరామము అని అర్థము. అందుచేతనే యతికి విరామము, విశ్రాంతి అను పేర్లు కలిగినవి.

తెలుగున యతి అనునది అక్షరమైత్రిగా పాటింప బడుచున్నది. యతి పాటించునపుడు హల్లు మైత్రియు, అచ్చు మైత్రియు పాటింపబడును.

మొదటి అక్షరము సంయుక్తాక్షరమైనపుడు, ఆ వర్గములో ఏదానికైనను యతి మైత్రి పాటింపవచ్చును.

**యతిమైత్రి గల అక్షరములు**

1. అ - ఆ - ఐ - ఔ - య - హ
2. ఇ - ఈ - ఋ - ౠ - ఎ - ఏ
3. ఉ - ఊ - ఋ - ఓ
4. ఋ - రి - రీ రె - రొ
5. క - ఖ - గ - ఘ
6. చ - ఛ - ఛ - జ - జ - ఝ - శ - ష - స
7. ట - ఠ - డ - ఢ
8. త - థ - ద - ధ
9. ప - ఫ - బ - భ - మ
10. ణ - న - జ్ఞ
11. ల - ళ - డ
12. ద - డ
13. పు - ఫు - బు - భు - ము
14. ప - ఫ - బ - భ - య - ర - ల - వ - శ - ష - స - హ - మ

ఉదా :-

న జ భ జ జ జ ర

III IUI UII IIU IUI IUI UIU

క్షితిప యివట్టి ప్రాకులు జిగిర్వ వసంతు దుతార సోపసం

మొదటి అక్షరమైన 'క్షి' కును పదునొకండవ అక్షరమైన 'గి' కును యతిమైత్రి కలదు.

'త' అక్షరమునకు ప్రాస.

న,జ,భ,జ,జ,జ,ర అను గణములున్నవి.

3. శార్దూల విక్రీడితము :-

1. నాలుగు పాదములుండును
2. ప్రతి పాదమునందు మ,స,జ,స,త,త,గ అను గణము లుండును
3. యతి స్థానము 13వ అక్షరము
4. ప్రాస నియమము కలదు
5. ప్రతి పాదమునందు 19 అక్షరములుండును.

ఉదా :-

మ స జ స త త గ

UUU IIU IUI IIU UUI UUI U

పంకేజా తములన్ దిసంతు లదుచున్ బాలామ ణీపాద ముల్

మొదటి అక్షరమైన 'ప'కును 13వ అక్షరమైన 'బా'కును యతిమైత్రి.

4. మత్తేభ విక్రీడితము :-

1. నాలుగు పాదములుండును
2. ప్రతి పాదమునందు స,భ,ర,న,మ,య,వ అను గణములుండును.

3. యతిస్థానము 14వ అక్షరము
4. ప్రాస నియమము కలదు
5. ప్రతి పానమునందు 20 అక్షరములుండును.

ఉదా :-

| స | భ | ర | న | మ | య | వ |
|---|---|---|---|---|---|---|
| I I U | U I I | U I U | I I I | U U U | I U U | I U |

అలవై కంతపు రంబులో నగరి లోనామూ లసౌధం బుదా

మొదటి అక్షరమైన 'అ'కును 14వ అక్షరమైన 'నా'కును యతిమైత్రి.

5. మత్త కోకిలము :-
1. నాలుగు పాదములుండును
2. ప్రతి పాదమునందు ర,స,జ,జ,భ,ర అను గణములు డును
3. యతిస్థానము 11వ అక్షరము
4. ప్రాస నియమము కలదు
5. ప్రతి పాదమున 18 అక్షరము లుండును.

ఉదా :-

| ర | స | జ | జ | భ | ర |
|---|---|---|---|---|---|
| U I U | I I U | I U I | I U I | U I I | U I U |

స్నాతకుం డునుబు త్విజాండు నునద్ధు రుండును నిష్టుదున్

మొదటి అక్షరమైన 'స్నా'కును 11వ అక్షరమైన 'న'కును యతిమైత్రి.

6. తరలము :-
1. నాలుగు పాదములుండును
2. ప్రతి పాదమున న,భ,ర,స,జ,జ,గ అను, గణము లుండును

3. యతిస్థానము 12వ అక్షరము
4. ప్రాసనియమము కలదు
5. ప్రతిపాదమున 19 అక్షరములుండును.

ఉదా :-

| న | భ | ర | స | జ | జ | గ |
|---|---|---|---|---|---|---|
| III | UII | UIU | IIU | IUI | IUI | U |

అగము లెక్కుచు మిన్నుము ట్టుచుహుం కరించు బలంబు తో

మొదటి అక్షరమైన 'అ' కును 12వ అక్షరమైన 'హు' కును యతిమైత్రి.

7. స్రగ్ధర :-

1. నాలుగు పాదములుండును
2. ప్రతి పాదమున మ, ర, భ, న, య, య, య అను గణము లుండును.
3. మొదటి అక్షరమునకు 8వ, 15వ, అక్షరములకు యతిమైత్రి కలదు.
4. ప్రాసనియమము కలదు.
5. ప్రతి పాదమున 21 అక్షరములుండును.

ఉదా :

| మ | ర | భ | న | య | య | య |
|---|---|---|---|---|---|---|
| UUU | UIU | UII | III | IUU | IUU | IUU |

శ్రీమన్మా ర్తీమకా రాశ్రిత రభన మయాసే వ్యమైసా నుమద్వి

మొదటి అక్షరమైన 'శ్రీ' కును 8,15 అక్షరములైన శ్రి, సేలకును యతిమైత్రి.

